Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 44 • 29-10-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# కాంగ్రెస్ సమాధికి రోశయ్య శ్రమదానం!



రాష్ట్రంలో జరుగుతున్న రాజకీయం ఏమిటి? ఇటు ప్రజలను, అటు రాజకీయవాదులను వేధిస్తున్న ప్రశ్న ఇది. రాష్ట్ర స్థాయిలో పార్టీకి, ప్రభుత్వానికి కానీ పూర్తి బాధ్యత ముఖ్యమంత్రిగా వున్నవారే స్వీకరించడం ఆనవాయితీ. అధికారంలో వున్నప్పుడు పిసిసి అధ్యక్షుడి పాత్ర చాలా పరిమితం. కానీ రోశయ్య ఆ బాధ్యత తీసుకోవడం లేదు. ఏదీ పట్టించుకోవడం లేదు. సిఎల్పి కార్యాలయంలో కూర్చొని కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ప్రభుత్వాన్ని ఇష్టం వచ్చినట్లు తిడుతున్నారు. ముఖ్యమంత్రిని కూడా వదలి పెట్టడం లేదు. ప్రభుత్వంలో ఏ మంత్రి కూడా ముఖ్యమంత్రిని లెక్క చేయడం లేదు. తమకు లాభం వచ్చే విషయాలలో ముఖ్యమంత్రి ప్రమేయం లేకుండా తమకు తామే నిర్ణయాలు తీసుకొని ఫైళ్ల మీద సంతకాలు పెట్టేస్తున్నారు. వివాదం తలెత్తే ప్రమాదం కన్పిస్తే మాత్రం ఫైల్ సిఎం పేషీకి తోసి పారేస్తున్నారు. ఈ నిజాన్ని రోశయ్య కూడా బహిరంగంగా అంగీకరించారు. మరొక ప్రక్క ప్రభుత్వం అనేది నామమాత్రమై పోయింది. క్రింది స్థాయిలో ప్రజలు చాలా ఇబ్బందులెదుర్కొంటున్నారు. ప్రభుత్వ పథకాల అమలును పర్యవేక్షించే వారు లేరు. ఏ పని అడిగినా నిధులు లేవంటున్నారు. ఒక ప్రక్క పన్నుల వసూళ్లు అన్ని రికార్డులను బ్రద్దలు కొడుతుంటే, మరొక ప్రక్క డబ్బు లేదని బిల్లులు నిలిపివేస్తున్నారు అధికారులు. ఈ వైరుధ్యం ఎందువల్లో, పన్నుల ద్వారా దండిన డబ్బంతా ఎక్కడకు పోతుందో చెప్పేవారు లేరు. మరొక ప్రక్క కాంగ్రెస్ కార్యకర్తల పరిస్థితి అయోమయంగా వుంది. పార్టీ భవిష్యత్తు మీద వారిలో రోజు రోజుకు నమ్మకం నశించి పోతున్నది. తీవ్రమైన నిరాశ నిస్పృహలతో నీరసపడి పోతున్నారు.

కానీ రోశయ్య మాత్రం ఏదీ పట్టించుకోవడం లేదు. ఆయన నిర్లిప్త ధోరణి వల్ల ప్రభుత్వం అదుపు తప్పి పోతున్నది. పార్టీలో క్రమశిక్షణ లోపిస్తున్నది. ఈ పరిస్థితి జగన్ వర్గానికి ఆనందం కల్గిస్తున్నది. రాష్ట్రంలో కాంగ్రెస్ పరిస్థితిని జగన్ వర్గం ముఖ్యుడొకడు చాలా బాగా వర్ణించాడు. కాంగ్రెస్ పార్టీ ఐస్ గడ్డ మీద వున్న శవం వంటిది. ఐస్ వున్నంత సేపు శవం తాజాగా వుంటుంది. అందువల్ల నాయకులు దాన్ని చుట్టూ కూర్చొని వున్నారు. ఆ ఐస్ కరగడం మొదలుపెడితే శవం వాసన కొడుతుంది. దాన్ని భరించలేక అందరూ చల్లగా జారుకొంటారు. ఐస్ కరగడం ఎప్పుడన్నదే ప్రశ్న. అందుకు ఆరు నెలలు పట్టవచ్చు. సంవత్సరం సమయం తీసుకోవచ్చు. ఎప్పుడైనా కాంగ్రెస్ వాదులందరూ మా వాకిట నిలబడి దేహీ అనక తప్పదు... ఇదీ జగన్ వర్గం వర్ణన. కాంగ్రెస్ సమాధి మీద తమ ఆశాసౌధాలు నిర్మించుకోవాలని జగన్ కలలు కంటుంటే, ఆ సమాధి నిర్మాణానికి ముఖ్యమంత్రి రోశయ్య శ్రమదానం చేస్తున్నాడు.

కొరవ 14వ పేజీలో

# కూపన్లతో ఆహారం

దేశంలోని ప్రజలందరికీ ఆహారం ఒక హక్కుగా గుర్తించాలని సోనియాగాంధీ నేతృత్వంలోని జాతీయ సలహా మండలి (ఎన్ఎసి) చేసిన సిఫార్సు విప్లవాత్మకమైనది. అరవై సంవత్సరాల స్వాతంత్ర్య భారత చరిత్రలో ప్రజా బాహుళ్య ప్రయోజనాలకు ఇంత పెద్ద పీట వేసిన చట్టం మరొకటి లేదు. గ్రామీణ ప్రాంతాలలోని 90శాతం మంది, పట్టణ ప్రాంతాలలోని 55 శాతం మంది ప్రజలు దీనివల్ల లబ్ధిపొందుతారు. దారిద్ర్యరేఖకు దిగువ అనే నిర్వచనంతో సంబంధం లేకుండా, ప్రభుత్వం నుంచి ఆహారం కోరేవారందరికీ దాన్ని అందించడం దీని లక్ష్యం. చవక ధరలకు బియ్యం, గోధుమలు ఇచ్చి సరిపెట్టుకోకుండా ఆరోగ్యంతో బ్రతకడానికి సరిపడా పోషకాహారం ప్రతి ఒక్కరికీ అందుబాటు చేయడం దీని ఆశయం.

ఇంత బృహత్తర ఆదర్శాన్ని ఆచరణలోకి తీసుకొని రావడం అంత సులభమైన విషయం కాదు. ఎన్నో సవాళ్ళు, ప్రతిబంధకాలు, ప్రతికూలతలు, ప్రతిఘటనలు ఎదుర్కొని, అధిగమించి దీన్ని ఆచరణకు తేవలసి వుంటుంది. దేశంలో ప్రస్తుతమున్న రేషన్ షాపుల వ్యవస్థ ద్వారా ఆహారం అందించడం అనేది అన్నిటికంటే ప్రధాన ప్రతిబంధకం. పాలకుల అలక్ష్యం, అధికారుల అవినీతి మూలంగా రేషన్ షాపుల వ్యవస్థ అవినీతితో పుచ్చిపోయింది. కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలోని భారత ఆహార సంస్థ, రాష్ట్ర ప్రభుత్వాల యాజమాన్యంలోని పౌర సరఫరాల కార్పొరేషన్‌లు కలిసి దేశంలో ఆహార సేకరణ, పంపిణీ యంత్రాంగాలను భ్రష్టు పట్టించాయి. అవినీతికి, అలసత్వానికి, అసమర్థ నిర్వహణకు మారు పేరుగా మారాయి. వారి అపసవ్య విధానాల వల్ల అటు రైతాంగానికి గిట్టుబాటు ధర లభించడం లేదు. ఇటు పేద ప్రజలకు నాణ్యమైన ఆహారం అందుబాటు కావడం లేదు. ఏటా కొన్ని వేల కోట్ల రూపాయలు అవినీతిపరుల జేబులకు చేరిపోతున్నాయి. కొన్ని లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఎలుకలు, పందికొక్కుల పాలౌతున్నాయి. ఈ సమస్యకు సరైన విరుగుడు కనిపెడితే తప్ప ఆహార హక్కు చట్టం అమలు సాధ్యం కాదు. అందుకు కొందరు నిపుణులు సూచిస్తున్న చిట్కా – ఆహార కూపన్ల పద్ధతి. రేషన్ షాపులన్నిటినీ మూసివేసి, పేదలకు వారికి నెలవారీ ఇచ్చే రేషన్ విలువకు సరిపడా కూపన్లు అందజేస్తారు. అవి ప్రభుత్వం ఇచ్చే చెక్కులతో సమానం. వాటిని చూపి, తమకు దగ్గరలోని కిరాణ అంగట్లో తమకు నచ్చిన ఆహార పదార్థాలు కొనుగోలు చేసే స్వేచ్ఛ పేదవాడికి వుంటుంది. దీనివల్ల బియ్యం, గోధుమలు వంటి వాటి సేకరణ బాధ్యత నుంచి ప్రభుత్వం పక్కకు తప్పుకోవచ్చు. మార్కెట్ శక్తులు పదార్థాల సేకరణ, నిల్వ, రవాణా, పంపిణీ వంటివి నిర్వహిస్తాయి. ఆహార ధాన్యాలు పుచ్చి పోవడం, ఎలుకలు తినడం వంటి అనర్థాలు ఆగిపోతాయి. పేదవాడు కూడా తనకు కావాల్సిన ఆహారాన్ని ఎంచుకొనే స్వేచ్ఛ పొందుతాడు.

కొన్ని దశాబ్దాలుగా నడుస్తున్న వ్యవస్థను సమూలంగా నాశనం చేసి, కొత్త ప్రయోగం చేయడం అంత క్షేమకరం కాదు. కానీ కొత్త మార్గాలను అన్వేషిస్తే తప్ప కొత్తగా తలపెట్టిన బృహత్ ఆలోచనలు ఆచరణకు రావు. ఆహార కూపన్ల విధానం ప్రపంచంలోని పలు దేశాలలో అమలులో వుంది. అక్కడి సాధక బాధకాలు అధ్యయనం చేసి, మన పరిస్థితులు, అవసరాలకు అనుగుణంగా మార్పు చేసి, ఒక్కొక్క ప్రాంతానికి విస్తరిస్తూ వెళ్లడం ఈ సమస్యకు పరిష్కారం. దేశంలోని పౌరులందరికీ గుర్తింపు ఇచ్చే ఆధార్ కార్డుల పంపిణీ ప్రారంభమౌతున్నది కాబట్టి, ఇటువంటి కొత్త ప్రయోగాలు చేయడానికి ఇదే మంచి తరుణం. ప్రతి పౌరుడికి సంబంధించిన సమాచారం ఈ కార్డుల రూపంలో కంప్యూటర్లలో నిక్షిప్తం అవుతాయి. ప్రభుత్వం చేపట్టే రేషన్ సరఫరా, ఉపాధి హామీ వంటి ఖరీదైన సంక్షేమ కార్యక్రమాలలో దుర్వినియోగం నివారించడానికి, ప్రతి పౌరుడి ఆర్థిక, సామాజిక స్థితిగతులను ఎప్పటికప్పుడు తెలుసుకొని, ప్రణాళికల రచనలో వాస్తవికతను పెంచడానికి ఆధార్ కార్డులు ఎంతో ఉపకరిస్తాయి. ఆ గుర్తింపు పత్రాలను ఆహార పంపిణీకి ఎంతగానో వినియోగించుకోవచ్చు. దేశంలోని ప్రతి పౌరుడు గౌరవప్రదమైన రీతిలో కడుపు నింపుకొనే వ్యవస్థను నిర్మించడం ఎంతో గొప్ప ఆదర్శం. అంతే మహత్తర బాధ్యతను భుజానికెత్తుకొన్న సోనియాగాంధీ, దాని సక్రమ అమలుకు తగిన సంస్కరణల పట్ల కూడా మనసు పెట్టి పరిశీలన చేస్తుందనే ఆశిద్దాం.

జమీన్‌రైతు

## జనవాణి

### రాజేశ్వరమ్మ సన్నిధిలో దగుల్భాజీలు!

నెల్లూరులో రాజరాజేశ్వరమ్మ దేవస్థానం చాలా ప్రసిద్ధి చెందింది. కాని ఆ దేవస్థానంలో పనిచేసే గుమస్తాల వైఖరి అభ్యంతరకరంగా వుంది. క్యూలైన్ల వద్ద డ్యూటీ చేసే వీళ్లు మహిళలను తాకుతూ, రాసుకొంటూ వెకిలి చేష్టలకు పాల్పడుతుంటారు. వీరు చూసే చూపులకు దేవాలయానికి వెళ్లాలంటేనే భయం కలుగుతుంది. వీళ్లకు ఇష్టమైన వాళ్లను గర్భగుడిలోనికి పంపుతారు. మిగతా వారిని గంటల తరబడి నిలబెడతారు. ఇక్కడి పాలకవర్గం, అధికారులకు వీరిపై చర్యలు తీసుకొనే దమ్ములు లేవు. దేవాదాయశాఖ మంత్రి గాదె వెంకటరెడ్డి అయినా విషయాన్ని విచారించి వీరి భరతం పట్టమనవి.

బాధితురాలు నెల్లూరు

### డివైడర్లతో ఆగిపోతున్న వర్షపు నీరు!

నెల్లూరు నేతలు, అధికార్లకు తలలో మెదడు వుండే కొన్ని పనికి మాలిన నిర్ణయాలు తీసుకొంటున్నారు. ఇటువంటి నిర్ణయమే గాంధీబొమ్మ నుంచి అయ్యప్పగుడి వరకు ట్రంకురోడ్డుపై డివైడర్‌గా రాతి గోడ కట్టడం. ఈ కట్టడం వల్ల ఇటీవల కురిసిన వర్షానికి పట్టణ పడమర వైపు ప్రాంతం నీరు తూర్పు వైపున వుండే పల్లపు ప్రాంతానికి పోలేక ట్రంకురోడ్డుపై నిలిచిపోయింది. జనం, వాహన చోదకులు నానా ఇక్కట్లు పడ్డారు. గంటా, అరగంట వర్షానికే ఈ పరిస్థితి ఉత్పన్నమయ్యింది. రోజంతా కురిస్తే ఎటువంటి గందరగోళ పరిస్థితి కలుగుతుందో చెప్పలేం. ఇప్పటికైనా నేతలు, అధికారులు చేసిన తప్పును సరిదిద్దుకొనే ప్రయత్నం చేస్తే జనం సంతోషిస్తారు.

పి.అరుణకుమారి నెల్లూరు

### వైఎస్ చేసిన మేళ్లే జగన్‌కు శ్రీరామరక్ష!

జిల్లాలో కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి చేస్తున్న ఓదార్పుయాత్రకు జనం స్వచ్ఛందంగానే తరలి వస్తున్నారు. దీనికి కారణం దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పల్లె ప్రజలకు చేసిన మేళ్లే. నెలనెల పెన్షన్, పావలావడ్డీకి రుణం, విద్యార్థులకు ఫీజు రాయితీ, వ్యవసాయానికి ఉచిత విద్యుత్, ఆరోగ్యశ్రీ పథకాలతో చాలా కుటుంబాలు లబ్ధిపొందాయి. వీరంతా గతంలో ఇందిరమ్మను చూడను వచ్చే తరహాలోనే జగన్‌ను చూడను వస్తున్నారు. రాష్ట్రంలో మరే నాయకుడికి గ్రామగ్రామాన సభలు పెట్టే దమ్ము లేదనే చెప్పవచ్చు.

కె.వెంకటసుబ్బయ్య బోగోలు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

1-11-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

### సౌత్‌స్టేషన్‌లో విద్యార్థుల గలభా

నెల్లూరు సౌత్‌స్టేషన్‌లో ఎక్కే దిగే విద్యార్థులు అనవసర గల్భా చేస్తున్నారని స్టేషన్ మాస్టరుకు తొందర గలిగిస్తున్నారనే మున్నగు విషయాలు వ్రాస్తున్నాడొక పెద్ద మనిషి.

నాయనలారా! ముందు మీరు డిసిప్లిన్ నేర్చుకోండి. పరులకు సేవ జేయడం తెలుసుకోండి. మాతృదేవతా రాధన త్యాగసుమాల సేకరించండి. అంతేగాని యిలాంటి చెడ్డ పేరుకు అవకాశం యివ్వద్దు సుమా!

### వీరికెందుకు?

గూడూరు ఆడపిల్లకాయల బడి టీచర్లంతా గ్రహచారవశాత్తు క్రైస్తవ నారీ రత్నాలుగనే ఏర్పడ్డారు. వారు ప్రొద్దస్తం మత బోధ, పురాణ నిరసన కాంగ్రేసు దూషణ చేస్తుంటారని ఒక విద్యార్థిని అన్న వ్రాస్తున్నాడు.

ఓ ఉపాధ్యాయినులారా! మీ డ్యూటీ మీరు చేసుకొని కాలం గడుపుకోకుండా మీకెందుకమ్మ ఈ అధిక ప్రసంగం?

### వెంకటగిరి గలాటా

వెనుక కలెక్టరు వారు జేసిన రాజీ ప్రకారం ఏ గ్రామ కంచె ఆ గ్రామానికి అదే మొత్తాలకు యివ్వకుండా వేలం పాటలు బెట్టడం హెచ్చుపాట బెట్టిన వారికి యివ్వడం వగైరా అక్రమ పద్ధతులు అమలులో బెడుతున్నారు.

ఇది చాలా అక్రమం, అన్యాయం, అనాది ఆచారానికి 1932 సం॥ రాజీకి యిది చాలా వ్యతిరేకం.

కాబట్టి దీన్ని గూర్చి రైతులంతా ఏకమై జిల్లా కలెక్టరు వద్దకు రాయబారం వెడలి తగు కర్తవ్యం నిర్ణయించుకోవలసి వుంది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

28-10-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఏ.సి. మంత్రిత్వంపై గోపాలరెడ్డి కృషి విఫలం!

ఏ.సి.సుబ్బారెడ్డి గారిని తిరుగా మంత్రివర్గంలోకి తీసుకొనుటకు ఢిల్లీలో బెజవాడ గోపాలరెడ్డిగారు జేసిన కృషి; సంజీవయ్య – సంజీవరెడ్డి గారల పరస్పర అనంగీకారమైన షరతులవల్ల విఫలమైనట్లు తెలుస్తున్నది.

సుబ్బారెడ్డి గారు రాయపూర్‌లో జరుగుతున్న అఖిలభారత సమావేశానికి అలవాటు లేకుండా పోవడాన్ని బట్టి, అక్కడ తిరుగా ఆంధ్ర రాజకీయాలు చర్చకు వచ్చి, ఇంకా వివాదంగా వున్న సమస్యలు గుడా సామరస్యంగా పరిష్కరింపబడే అవకాశమున్నదని రాజకీయజ్ఞులు ఊహిస్తున్నారు.

### నెల్లూరు ముచ్చట్లు

రక్తదాత ఎస్.వి.నరసింహారావుగారు, 22తేది నెల్లూరు బ్లడ్‌బ్యాంకులో తన రక్తాన్ని 37వ పర్యాయం దానమిచ్చాడనే త్యాగమయ వార్తను మా పాఠకులకు వినిపించుటకు సంతోషిస్తున్నాము.

### పొగత్రాగుడు అరెస్టులు

సినిమా హాల్‌లో పొగత్రాగే వారిని పోలీస్ అరెస్ట్ చేస్తున్నది. ధూమపాన దాసులారా బహు పరాక్!

### ముస్లిం బాలిక హత్యలో రిమాండ్

నెల్లూరులో సంచలనం కల్గించిన పదేళ్ల ముస్లిం బాలిక రజియాబీ హత్యకు సంబంధించి హంతకులనే అనుమానంతో సయ్యద్ నజీర్, సయ్యద్ గౌస్ లిరువురూ అరెస్ట్ గావింపబడి, ఇం.పీ.కో.302 సెక్షన్ క్రింద కేసు నమోదు చేయబడి, రిమాండుకు పంపబడినట్లు తెలుస్తున్నది.

# నెల్లూరు ముచ్చట్లు

## దివంగత జర్నలిస్టుల చిత్రపటావిష్కరణలు!

నెల్లూరు మహబూబ్‌ఖాన్ పార్కులో ఎపియుడబ్ల్యుజె నేతృత్వంలో నడుస్తున్న ప్రెస్‌క్లబ్‌లో దివంగత పాత్రికేయుల చిత్రపటాలను 26వ తేది రాష్ట్ర పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఆవిష్కరించారు. జమీన్‌రైతు పూర్వ సంపాదకులు నెల్లూరు వెంకట్రామానాయుడు, నెల్లూరు శ్రీరామమూర్తి, హిందూ జి.కె.రెడ్డి, కాసా సుబ్బారావు, నలుమోలు గోపాల కృష్ణయ్య, ఇంద్రగంటి సుబ్రహ్మణ్యం, పత్తి సుబ్బారావు, మరుపూరు కోదండ రామిరెడ్డి, చుండి విశ్వనాథం, కొట్రా ఆదిశేషయ్య, జి.దశరథరామయ్య, జి.వి.రమణయ్య, మన్నేపల్లి మారుతి రావు, టి.అనంతపద్మనాభరావు, ఐవి.రావ్, డిటివి రాజగోపాలచారి, బొద్దుకూరు ధర్మారావు, జి.సురేంద్ర నాథ్, ఎం.మురళీకృష్ణ, బి.రమణయ్య, బిట్రగుంట హనీఫ్, చెంగల్రాజు చిత్ర పటాలు ఇందులో వున్నాయి. ఈ కార్య పాలక శాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. 26వ తేది సాయంత్రం నెల్లూరు ప్రెస్‌క్లబ్‌లో దివంగత జర్నలిస్టుల చిత్రపటావిష్కరణ కార్యక్రమానికి రెండు గంటలు ఆలస్యంగా విచ్చేసిన ఆయన రాజకీయ, పాత్రికేయ వ్యవస్థల మీద మంచి ఉపన్యాసమే దంచారు.

ఇటీవల మీడియాలోనూ, రాజకీయ వ్యవస్థలోనూ తప్పటడుగులు దొర్లుతున్నాయి. విశ్వసనీయత కోల్పోతున్నాయి. ఈ వ్యవహారం పట్ల విరక్తి చెందాల్సిన అవసరం లేదు. సమస్యలను అధిగమించి పూర్వవైభవం తెద్దామన్నారు. కొన్నిసార్లు మీడియాలో వచ్చే వార్తలు నిందాపూర్వకంగా వుండి బాధ పెడతాయని రాజకీయాల్లో వుండడం వల్లే ఇలా జరుగుతుంది కదా అనే వైరాగ్యం కూడా వస్తుందని మంత్రి తన మనసులో మాట చెప్పారు.

## చీరకట్టిన వివేకా

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి వేసే చిత్రవిచిత్ర వేషాలు జనాలకు తెలియంది కాదు. 24వ తేది క్రమంలో రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, సిటీ ఎమ్మెల్యే శ్రీధర్ కృష్ణారెడ్డి, హెల్పింగ్ హ్యాండ్ సంస్థ నిర్వాహకుడు కృష్ణారెడ్డి, వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ అధ్యక్ష కార్యదర్శులు జయప్రకాష్, వెంకట సుబ్బయ్య పాల్గొన్నారు. విఆర్ హైస్కూల్ గ్రౌండ్‌లో ఏర్పాటు చేసిన హస్తకళా ప్రదర్శన ప్రారంభించి అక్కడ ఓ స్టాల్‌లోని పట్టుచీరను చుట్టుకొని అతివలా మురిసిపోతూ ఫోటోలకు ఫోజులిచ్చారాయన. ప్రతి స్టాల్ వద్ద ఈయన వేసిన వేషాలు చూసి ప్రదర్శన నిర్వాహకులు విస్తుపోయారు.

## గుమ్మడికాయ దిష్టి

రూరల్ పరిధిలోని ఒక గ్రామంలో వైఎస్ జగన్‌ను సాదరంగా స్వాగతించిన మహిళలు ఒక పెద్ద గుమ్మడికాయ తెచ్చి, ఆయన చుట్టూ తిప్పి దాని ముఖాన ఉమ్మేసి, క్రిందపడేసి కాళ్లతోతొక్కి, పగలగొట్టారు. ఇంత తతంగం... జగన్‌కు తగిలిన దిష్టి పోగొట్టడం కోసం. ఆనం దిష్టి, వి.హనుమంతరావు దిష్టి పోవాలని కోరుకొన్నారు ఆ మహిళలు. వారిద్దరి పేర్లు చెప్పినప్పుడల్లా గుమ్మడికాయలోనే వారిని చూసుకొని, కసిదీరా కేకరించి ఉమ్మేశారు. ఆ సన్నివేశం చూసి వుంటే ఆనం సోదరులు నీళ్లులేని బావిలోనైనా సరే వెనుకాడకుండా అట్నే దూకేసి ఉండేవారనిపించింది.

## తప్పుని ప్రశ్నించలేము!

సమాజంలోని ప్రధాన వ్యవస్థలలో ఏ ఒక్క వ్యవస్థ తప్పుచేసినా తప్పును ప్రశ్నించి సరిదిద్దుకొనే అవకాశం వుందని, కానీ మీడియా ఒకసారి తప్పుడు వార్త ప్రచురించినా, ప్రసారం చేసినా సరిదిద్దుకొనే పరిస్థితి లేదని రాష్ట్ర పుర

## సిపిఐ రాష్ట్ర కార్యవర్గ సమావేశం

కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా రాష్ట్ర కార్యవర్గ సమావేశాలు తొలిసారిగా నవంబర్ 7, 8 తేదీల్లో నెల్లూరులో ఆ పార్టీ అత్యాధునికంగా కట్టిన ఆఫీసు రామకోటయ్య భవన్‌లో జరుగనున్నాయి. పార్టీ జాతీయ ఉప కార్యదర్శి సురవరం సుధాకర్‌రెడ్డి, రాష్ట్ర కార్యదర్శి కె.నారాయణ, తమిళనాడు రాష్ట్ర కార్యదర్శి పాండ్యన్ పాల్గొంటారు.



## చాన్నాళ్లకు రామనారాయణ తనిఖీలు!

పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నెల్లూరు నగరంలో ఆకస్మిక తనిఖీలంటూ మీడియాకు మెసేజ్ లిచ్చి బయలుదేరిన 24 గంటల తర్వాత కూడా కార్పొరేషన్ అధికారులు కనీస పారిశుద్ధ్య చర్యలు తీసుకోలేదంటే వీరెంత ముదిరిపోయారో అర్థం చేసుకోవచ్చు. 25వ తేది ఉదయం ట్రాక్ సూట్‌లో ఇంటి నుంచి ఆకస్మిక తనిఖీలకు బయలుదేరిన రామనారాయణరెడ్డి 28, 30 డివిజన్లలోని కేశవులునగర్, సంజయ్‌గాంధీ నగర్‌లలో పర్యటించారు. 28వ డివిజన్‌లోని మస్టర్ కార్యాలయంలో రిజిష్టర్‌ను పరిశీలించగా 43 మంది సిబ్బంది విధులకు హాజరు కావాల్సి వుండగా 18 మందే రావడాన్ని తప్పుపట్టారు. ఈ విషయమై శానిటరీ ఇన్స్‌పెక్టర్ రాంబాబును వివరణ అడిగారు. సంజయ్‌గాంధీ నగర్‌కు మంత్రి వస్తున్నాడని తెలిసి అప్పుడే కాలువలు శుభ్రపరుస్తుండగా చూసి మందలించారు. కార్పొరేషన్ అధికారులు రోజువారీ తనిఖీలు చేస్తే ఇటువంటి పరిస్థితులు ఉత్పన్నం కావన్నారు.

సంతపేట సెంటర్ నుంచి వెళ్లే రైల్వేఫీడర్స్ రోడ్డులో మంత్రి కాసేపు తిరిగారు. ఈ రోడ్డు అభివృద్ధికి 3.5 కోట్ల రూపాయలతో అంచనాలు సిద్ధం చేస్తామన్నారు. ఆత్మకూరు బస్టాండ్ నుంచి సర్వేపల్లి కాల్వ మీదుగా స్టోన్ హౌస్‌పేటకు వెళ్లే మార్గంలో కొత్త బ్రిడ్జిలు కడతామన్నారు. స్టోన్‌హౌస్‌పేట రోడ్డును 14.4 మీటర్ల వెడల్పుతో వేస్తామన్నారు. ఈ ప్రాంతంలో 70 ఏళ్ల క్రితం వేసిన రోడ్డు బ్రహ్మాండంగా వుందని కొత్తగా వేసే రోడ్డు కనీసం 50 ఏళ్ల పాటు వుండేలా ఇంజనీర్లు జాగ్రత్తలు తీసుకోవాలన్నారు.

నెల్లూరు పెద్దాసుపత్రిని సైతం మంత్రి సందర్శించారు. ప్రైవేట్ ఆసుపత్రులు పడకలు లేక కిటకిటలాడుతుంటే పెద్దాసుపత్రిలో పడకలన్నీ ఖాళీగా వుండడం బట్టే ఇక్కడ అందుతున్న వైద్యం ఏమిటో అర్థం చేసుకోవచ్చని రుసరుసలాడారు. మంత్రి వెంట జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి కూడా వున్నారు. మంత్రి అయిన చాన్నాళ్లకు రామనారాయణరెడ్డి నెల్లూరు రోడ్లపై రావడాన్ని చూసి ప్రజలు విస్తుబోయారు.

## ఇరానీ దొంగలు!

నెల్లూరు నగరానికి ఇరానీ దొంగల ముఠా వచ్చిందని జనం అప్రమత్తంగా వుండాలని ఎస్పీ దామోదర్ హెచ్చరిస్తున్నారు. ఇటీవల వరకు ఒంగోలులో వుండిన ఈ ముఠా మహిళలను లక్ష్యంగా చేసుకొని దోపిడీలు చేస్తుందన్నారు. ఒంటరిగా వెళ్తున్న మహిళలను గమనించి ఒక వ్యక్తి మెళ్లోని నగలు జాగ్రత్త అని చెప్పగా, స్కూటర్‌పై వచ్చే మరో వ్యక్తికి పోలీస్ సెల్యూట్ చేసి మహిళలను ఏమారుస్తున్నారు. తర్వాత ఇద్దరు అపరిచితులు తాము పోలీసులమని మహిళల మెడల్లోని నగలను తీయించి కాగితంలో చుట్టి ఇచ్చే లోపల హస్తలాఘవంతో వాటిని కొట్టేస్తారు. ఒంటరిగా స్త్రీలు వుండే ఇళ్లకు సైతం రకరకాలుగా వెళ్లి మభ్యపెట్టి దోపిడీ చేస్తారట. కాబట్టి నెల్లూరీయులు తస్మాత్ జాగ్రత్తగా వుండాలి.

## ఆంధ్రులకు ఆరోగ్యశ్రీ... ఆనమోళ్లకు భానుశ్రీ

వైఎస్ జగన్ ఓదార్పు యాత్ర నెల్లూరు రూరల్ నియోజకవర్గం చేరుకోగానే ఈ నినాదం చెవుల్లో ప్రతిధ్వనించింది. ములుమూడి, దేవరపల్లి, కందమూరు తదితర గ్రామాలన్నింటిలో ఇదే గోల. ఇది ఆనం వివేకానందరెడ్డి నియోజకవర్గం. ఎమ్మెల్యేగా గెల్చిన తర్వాత ఈ గ్రామాల వైపు ముఖం కూడా తిప్పి చూడలేదు. భానుశ్రీ సేవలో తరిస్తూ నెల్లూరు మునిసిపల్ పరిధులలోనే గిరికీలు తిరగడం ఆయనకలవాటై పోయింది. ఈ కోపాన్ని పల్లె జనం ఇంత అందమైన నినాదంతో వ్యక్తం చేశారు.

## చింతా తనిఖీలు

తిరుపతి ఎమ్పీ చింతామోహన్ గతంలోలా కాకుండా ప్రస్తుతం తన వ్యవహారశైలిని మార్చుకొన్నారు. జనంలో తిరిగి వారి సమస్యలు తెలుసుకొని పరిష్కారాలు చూపడంతోపాటు ప్రభుత్వ కార్యాలయాలకు వెళ్లి అక్కడి రికార్డులు చూసి వారి పనితీరును అంచనా వేస్తున్నారు. గతవారం ఐటిడిఏ కార్యాలయాన్ని తనిఖీ చేసిన ఆయన 25వ తేది నెల్లూరులోని ఎస్సీ, బిసి కార్పొరేషన్, ఐసిడిఎస్ కార్యాలయాలకు వెళ్లి తనిఖీ చేశారు. ఎస్సీ కార్పొరేషన్‌ను పెట్టి 36 ఏళ్లయ్యింది. వేల కోట్ల నిధులను కార్పొరేషన్ ఖర్చు పెట్టింది. ఒక్క ఎస్సీ అయినా కారు కొనే స్థాయికి ఎదిగారా అంటూ చింతామోహన్ కార్పొరేషన్ ఇడి నాగలక్ష్మిని అడగ్గా ఆమె నోరెళ్ల బెట్టింది. జిల్లాలో 38 శాతం మంది బిసిలుంటే ఏడాదికి 25 లక్షల రూపాయల నిధులు ఎలా సరిపోతాయని కార్పొరేషన్ ఇడి కోటేశ్వరరావును ప్రశ్నించగా ఆయన నీళ్లు నమిలారు. ఐసిడిఎస్‌తోపాటు అది నిర్వహించే బాలసదన్ పనితీరుపై చింతా లేవనెత్తిన సందేహాలకు ప్రాజెక్ట్ డైరెక్టర్ శారదాదేవి సమాధానాలు చెప్పలేక పోయారు.

నెల్లూరులోని అధికార పార్టీ నేతలు ప్రభుత్వ కార్యాలయాలకు వెళ్లి రికార్డులు పరిశీలించడం లేదు. ఈ విద్యలో నేర్పరి అయిన చింతామోహన్ ఈ కార్యక్రమం కొనసాగిస్తే ప్రభుత్వ కార్యాలయాలలో జవాబుదారీ పెరుగుతుంది.

## సోమశిల ప్రాజెక్ట్ పరిశీలనలో బిజెపి!

భారతీయ జనతా పార్టీ నేతలు సోమశిల ప్రాజెక్టును 25వ తేది వెళ్లి పరిశీలించారు. జలయజ్ఞంలో భాగంగా ప్రాజెక్ట్ పరిధిలో జరగాల్సిన ప్యాకేజి 11, 32, 94, 96 నెంబర్ పనులను పరిశీలించారు. 108 కోట్ల రూపాయల విలువచేసే ఈ పనులు 20 శాతం కూడా జరగలేదన్నారు. మొబలైజేషన్ అడ్వాన్సులు తీసుకొని కూడా ఇలాచేస్తే ఎలాగన్నారు. సోమశిల – స్వర్ణముఖి లింకు కాల్వ, ఉత్తర, దక్షిణ కాల్వల పనులను బిజెపి నేతలు సురేష్‌రెడ్డి, ఆంజనేయరెడ్డి, రమేష్, సత్యనారాయణల నేతృత్వంలోని బృందం పరిశీలించింది.

## బుచ్చి సభ బ్రహ్మాండం!

జిల్లాలో కడప ఎమ్పీ జగన్మోహన్‌రెడ్డి ఓదార్పు యాత్ర ప్రారంభించిన నాటి నుంచి పలు చోట్ల రాజశేఖర్‌రెడ్డి విగ్రహావిష్కరణలు, బహిరంగ సభలు జరిగాయి. 25వ తేది వరకు జరిగిన సభల్లో మణి మకుటం బుచ్చిరెడ్డిపాళెం సభ. అర్ధరాత్రి దాటాక 1.30 ప్రాంతంలో జరిగిన సభకు జనం పెద్ద సంఖ్యలో హాజరవ్వడాన్ని చూసిన జగన్ ఆ సమయంలో ఉత్సాహం ఉరకలెత్తి రొటీన్ ఉపన్యాసానికి బదులుగా మాట్లాడి సభికుల అభిమానం పొందాడు. 26వ తేది ఉదయం కూడా జగన్‌ను చూడను బుచ్చిలో జనం పోర్లబడ్డారు. ఈ క్రెడిట్ మొత్తం తనదంటున్నాడు కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి. నమ్ముదామా?

## తీరంలో అలజడి

ఇండోనేషియాలో 26వ తేది భూకంపం తాలుకు ప్రకంపనలు జిల్లా తీరంలోని సముద్రంలోనూ కనిపించాయి. తడ నుంచి తెట్టు వరకు సముద్రుడు అలజడికి లోనయ్యాడు. సముద్రం లోతు ఎక్కువగా వుండే తుమ్మలపెంట, మైపాడులలో అలల ఉధృతి అధికంగా వుండింది.

కొరవ 14వ పేజీలో

# మార్కెట్ నాగేశ్వరరావు కట్టించిన సిపిఐ ఆఫీసు!

## ● వసూళ్లపై విమర్శల వెల్లువ.

నెల్లూరీయులకు మార్కెట్ నాగేశ్వరరావును పరిచయం చేయనక్కరలేదు. సిపిఎం పార్టీలో సామాన్య కార్యకర్తగా కాలిడిన ఆయన కేవలం ఆ పార్టీ కోటమిట్ట శాఖ కార్యదర్శిగా పని చేశారు. కానీ పార్టీ జెండా అండతో చేసిన పంచాయితీలతో కోట్లకు పడగెత్తారు. ఎసి కూరగాయల మార్కెట్‌లో పెత్తనంతో తిరుగులేని రౌడీ పాపులారిటీని సంపాదించారు. కానీ గత ఎన్నికల్లో కార్పొరేటర్‌గా కూడా గెలవలేక పోయారు. సిపిఎం పార్టీ నగరంలో ఆయనతో గబ్బుపట్టి పోవడంతో చాలా రోజులు ఆలోచించి సస్పెండ్ చేసింది. ఆ తర్వాత సిపిఐ పార్టీ ఆయన్ను రెడ్‌కార్పెట్ పరచి స్వాగతించింది. ఆ చర్యతో ఖుష్ ఖుష్ అయిన నాగేశ్వరరావు ఆ పార్టీకి నగరంలో స్వంత ఆఫీసు కట్టే పనికి సమాయత్తం అయ్యారు. తనకున్న పరిచయాలు, తాను సహాయపడ్డ వ్యక్తుల నుంచి లక్షలు వసూళ్ళుచేసి రైల్వేస్టేషన్ రోడ్డులో 30 అంకణాల్లో రెండంతస్తుల పార్టీ భవనాన్ని రికార్డు స్థాయిలో ఏడాదిలో పూర్తి చేయించారు. నాగేశ్వరరావు పని నాగేశ్వరరావు చేస్తుండగా సిపిఐ జిల్లా కార్యదర్శి పములజల దశయ్య కూడా ఆఫీసు నిర్మాణం పేరిట కొన్ని వసూళ్లు చేశారట. వీటికి వేటికీ రశీదు లేదు. లెక్కాపక్కా లేదని సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ మందలించడంతో అర్జున్ బ్యాంక్‌లో ఓ అకౌంట్ తెరచి సరిపెట్టారు. ఇప్పటికి సిపిఐ ఆఫీసు




నెల్లూరు రైల్వేఫీడర్స్ రోడ్డులో కొత్తగా కట్టిన సిపిఐ పార్టీ ఆఫీసు.

నిర్మాణానికి ఎన్ని లక్షలు వసూలు చేశారన్నది పాపం ఈ కార్యాలయానికి తన పేరు పెట్టిన నిస్వార్ధ కమ్యూనిస్ట్ రామకోటయ్య గారికి కూడా తెలిసి వుండదనొచ్చు.

అధునాతన హంగులన్నీ సమకూర్చిన ఈ ఆఫీసులో నవంబర్ 7, 8 తేదీల్లో పార్టీ రాష్ట్ర కార్యవర్గ సమావేశాలు జరగనున్నాయి. ఆ పార్టీ జాతీయ ఉప కార్యదర్శి సురవరం సుధాకర్‌రెడ్డి వీటికి హాజరవుతున్నారు. పార్టీ సభ్యుల దగ్గర రెండు రూపాయలు చందాకు లెక్కలు చెప్పే పార్టీలో లక్షలాది రూపాయల వసూళ్లతో నాగేశ్వరరావు కట్టించిన ఆఫీసుకు నిధులు ఎక్కడ నుంచి వచ్చాయని అడిగే వారు లేరు. నెల్లూరులో సిపిఐకి బలం లేకపోవచ్చు. కానీ బేవార్స్ వసూళ్ల పార్టీ అని ఇన్నాళ్లు రాని పేరును ఒక్క ఏడాదిలోనే నాగేశ్వరరావు తెచ్చి పెట్టాడు. అదీ ఆ పార్టీ అసలు కార్యకర్తల బాధ. దీన్నెవరు తీర్చగలరు?

# దొంగలను ఎవరు పట్టాలి?

## ● ఎస్పీ ఆదేశాలతో గందరగోళం



ఉన్నతాధికారులు తీసుకొనే నిర్ణయాలు, చేపట్టే చర్యలు ప్రజలకు ఉపయోగంగా ఉండాలి తప్ప అవి అసలుకే ఎసరు పెట్టేలా వుండకూడదు. జిల్లా ఎస్పీ దామోదర్ వ్యవహారశైలితో ఈ సమస్య ఎదురౌతుంది. సాధారణంగా లా అండ్ ఆర్డర్, క్రైం విభాగాలు ప్రత్యేకంగా తమ విధులు నిర్వర్తిస్తుంటాయి. ఎస్ఐలు ప్రతి స్టేషన్‌కు అటు లా అండ్ ఆర్డర్‌కు ఒకరు, ఇటు క్రైం విభాగానికి మరొకరు వుంటారు. రాష్ట్రంలో ఎక్కడా లేనివిధంగా దొంగతనాలు ఇతర నేరాలను లా అండ్ ఆర్డర్ ఎస్ఐలు పర్యవేక్షించాలంటూ ఎస్పీ దామోదర్ ఇటీవల క్రొత్తగా ఆదేశాలు జారీ చేశారు. వినడానికి ఇది మంచి పద్ధతిలాగే వున్నా ఆచరణకు వచ్చేటప్పటికి పలు సమస్యలు ఉత్పన్నం అవుతున్నాయి. క్రైం విభాగానికి చెందిన సిబ్బంది దొంగతనం, దోపిడీ జరిగినప్పుడు సంఘటనా స్థలానికి పోయి కీలకమైన నేరస్తుల వేలి ముద్రలను ఇతరత్రా సమాచారాన్ని సేకరించేవారు. ఇప్పుడు లా అండ్ ఆర్డర్ ఎస్ఐలకు ఈ బాధ్యతలు అదనంగా అప్పజెప్పడంతో పలు సమస్యలు ఎదురౌతున్నాయి. పోలీస్‌స్టేషన్‌కు వచ్చే బాధితులకు ఎస్ఐలు అందుబాటులో వుండడమే కష్టం. అలాంటిది వీరిపై అదనపు బాధ్యతలు పడడంతో రెగ్యులర్ పనులు చేయలేక, అదనపు బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించలేక లా అండ్ ఆర్డర్ ఎస్ఐలు సతమతమవుతుండగా, మరోవైపు క్రైం ఎస్ఐలకు, వీరికి మధ్య పొరపొచ్చాలు ఏర్పడుతున్నాయి. ఈ ప్రభావం బాధితులపై పడుతుండడంతో నేరస్తులు సులభంగా తప్పించుకొంటున్నారు.

# మద్యపాన ప్రియుల్లతో మద్య వ్యతిరేక ప్రచారం!

## ప్రజారాజ్యం పార్టీ వరుస బాగుంది




మూలాపేట సెంటర్‌లో మాట్లాడుతున్న సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి.

నెల్లూరు నగరంలోని ప్రజలను కలిసేందుకు ప్రజారాజ్యం పార్టీ నానాపాట్లు పడుతుంది. నగరంలోని మద్యం బెల్టుషాపులను తొలగించి మద్యపానాన్ని మానాలని జనాన్ని చైతన్యం చేస్తూ పాదయాత్రలు నిర్వహిస్తుంది. 24వ తేది మూలపేటలో సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి అయ్యప్పదీక్షలో వుండి కాళ్లకు చెప్పుల్లేకుండా ఓపిగ్గా వీధి వీధి తిరిగారు. మద్యం బెల్టుషాపులను తొలగించడానికి ప్రజారాజ్యం పార్టీ చేపట్టిన ఉద్యమానికి ప్రజలు మద్దతు ఇవ్వాలన్నారు. సంపూర్ణ మద్యపాన నిషేధాన్ని విధించిన ఎన్టీఆర్ విగ్రహం ముందే మూలాపేటలో బ్రాందీషాపు వుండడం పట్ల ఆవేదన వ్యక్తం చేశారు. ఖజానా నింపుకోవడం కోసం దేవాలయాలు, పాఠశాలలు, నివాసిత ప్రాంతాల్లో బ్రాందీషాపులు ఏర్పాటు చేయడాన్ని శ్రీధర్‌కృష్ణారెడ్డి తప్పుపట్టారు.

వాస్తవానికి నెల్లూరు నగరంలో ఎక్కడ బెల్ట్‌షాపులు నడుస్తున్నాయో శ్రీధర్‌కృష్ణారెడ్డికి తెలియంది కాదు. ఆయన గట్టిగా గదమాయించి తన మనుషులను రంగంలోకి దించితే వారం రోజుల్లో బెల్టుషాపులు లేకుండా చేయవచ్చు. కానీ అటువంటి ప్రయత్నం ఆయన చేయడం లేదు. పైపెచ్చు మద్యవ్యతిరేక ప్రచారంలో ఆయన చుట్టూ మద్యపాన ప్రియుల్లుండడం విమర్శలకు దారితీస్తుంది. ఈ విషయాన్ని ఆయన గమనిస్తున్నట్లు లేదు.

నగరంలో పారిశుద్ధ్యం పాతరగా వుంది. దోమల విజృంభణతో ప్రతి ఇంట్లో జ్వరాలు, ఇతర అనారోగ్య సమస్యలు పెరిగాయి. సక్రమంగా మంచినీటి సరఫరా లేదు. వీధిలైట్లు వెలగడం లేదు. డ్రైన్లు, రోడ్ల పరిస్థితి దారుణం. ఈ సమస్యల పరిష్కారంపై సిటీ ఎమ్మెల్యేగా శ్రీధర్‌కృష్ణారెడ్డి దృష్టి పెట్టి పరిష్కరిస్తే బాగుంటుందని జనాభిప్రాయం.

## పట్టుకొన్నదొకరు - పేరొకరిది!

# క్రైం పోలీసుల మధ్య రగడ!

నేరాలను అరికట్టి, దొంగలను పట్టుకోవాల్సిన నెల్లూరు సెంట్రల్ క్రైం స్టేషన్‌లో ఆధిపత్య పోరు తీవ్రమవుతున్నది. క్రైం విభాగం, రేంజ్ క్రైం స్క్వాడ్ విభాగాలకు ఇద్దరు సిఐలు వున్నా ఇక్కడ సమన్వయంతో పనిచేసినట్లయితే జిల్లాలో పెచ్చురిల్లుతున్న దొంగతనాలను అరికట్టవచ్చు. కానీ ఇరువురు అధికారుల మధ్య ఆ సమన్వయం కొరవడడం, ఎవరికి వారు ఆధిపత్యం కోసం ప్రాకులాడుతుండడంతో ఆ ప్రభావం సిబ్బందిపై పడుతుంది. ఫలితంగా క్రైం, రేంజ్ స్క్వాడ్ పోలీసుల మధ్య వర్గ విభేదాలు భగ్గుమంటు




నిత్యం వివాదాల్లో సిసిఎస్ పోలీస్‌స్టేషన్. (ఫైల్‌ఫోటో).

న్నాయి. నేరస్తులను పట్టుకొనే సందర్భంలో రెండు విభాగాల సిబ్బంది ఎవరికి వారు తమ పేరు ప్రఖ్యాతులు చాటుకొనేందుకు, తమ ఆధిపత్యాన్ని ప్రదర్శించేందుకు తాపత్రయ పడుతుండడంతో గొడవలకు దారితీస్తున్నాయి. ఇటీవల పెద్దఎత్తున దొంగతనానికి గురైన సొత్తును రికవరీ చేసినప్పుడు నగర డిఎస్పీ రాధిక, క్రైం సిఐ బాజీజాన్ సైదా, రేంజ్ క్రైం కంట్రోల్ స్క్వాడ్ సిఐ శ్రీనివాస్‌లతో కలసి విలేకరుల సమావేశం ఏర్పాటు చేశారు. డిఎస్పీ వివరాలను తెలుపుతున్న సమయంలో పత్రికా ప్రకటనలో కష్టపడి దొంగలను పట్టుకొన్న తమ పేర్లు లేకుండా, సిసిఎస్ సిబ్బంది పేర్లు వున్నాయంటూ కొందరు సిబ్బంది ప్రెస్‌నోట్‌ను డిఎస్పీ వద్ద నుంచి లాక్కొని చింపి ముక్కలు చేశారు. ఇది చూసి నిశ్చేష్టురాలైన డిఎస్పీ సిబ్బందిని మందలించక మౌనంగా వుండి పోయింది. సిసిఎస్‌లో వర్గపోరుకు ఇదొక ఉదాహరణ. వైద్యులకు, ప్రజాసంఘాలకు ఉచిత సలహాలిచ్చే ఎస్పీ మొదట తన సిబ్బందిని గాడిలో పెడితే బాగుంటుందేమో.

# వాస్తవాలు మాట్లాడితే విమర్శలా?

## సిపిఎం నేత మోహన్‌రావు ఆవేదన

నెల్లూరు వైఎస్ఆర్‌నగర్‌లో ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణంలో అవకతవకలను ప్రశ్నిస్తే తమను అభివృద్ధి నిరోధకులనడం సమంజసం కాదని సిపిఎం నగర నేత మోహన్‌రావు ఆవేదన వ్యక్తం చేశారు. పేదలు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించాలంటూ నెల్లూరు ఎమ్మార్వో కార్యాలయం వద్ద గతవారం రోజులుగా సిపిఎం నేతృత్వంలో జరుగుతున్న రిలే నిరాహార దీక్షా శిబిరం వద్ద ఆయన విలేకరులతో మాట్లాడారు. ఇక్కడ 34 వేల మందికి ఇళ్లు కడతానన్నారు. 1600 ఇళ్లే కట్టారు. వాటిలోనూ సవాలక్ష అవకతవకలు. ఇళ్ల నిర్మాణం చేపట్టిన కాంట్రాక్టర్ల చేత బిల్లులు రాలేదని ఎమ్మెల్యే వివేకానందరెడ్డి విలేకరుల సమావేశం పెట్టించారు. ఇప్పటివరకు 20 కోట్ల రూపాయల బిల్లులు చెల్లించారని మోహన్‌రావు ఆ వివరాలను విలేకరులకు అందించారు.

శిబిరం వద్ద సిపిఎం కురువృద్ధ నేత జక్కా వెంకయ్య మాట్లాడుతూ వైఎస్ చేపట్టిన పలు పథకాలను రోశయ్య సర్కారు తుంగలో తొక్కుతుందన్నారు. దీనికి ఉదాహరణగా వికలాంగులకు ఇస్తుండిన 500 రూపాయల పింఛను 200 రూపాయలకు తగ్గించడమేనన్నారు. పేదలకు అసైన్‌మెంట్ భూమిని తక్షణం పంపిణీ చేయాలని వీటికి ఏక్ సాల్ లీజు పట్టాలు ఇవ్వాలన్నారు. జిల్లాలో డెంగ్యూ జ్వరబాధితులు పెచ్చుపెరిగినా ఎవరికీ పట్టకపోవడాన్ని విమర్శించారు.

# టపాసుల వ్యాపారం వెనుక దాగిన అవినీతి!

**శివకాశి నుంచి నెల్లూరుకు వస్తున్న కోట్లాది రూపాయల విలువ చేసే టపాసులపై తడ దగ్గర ఉమ్మడి తనిఖీ కేంద్రంలో విధులు నిర్వహిస్తున్న వాణిజ్య పన్నుల శాఖ అధికారులు పన్నులు విధించకుండా తమ జేబులు నింపుకొంటుండడంతో ప్రభుత్వ ఖజానాకు తీవ్ర నష్టం కలుగుతోంది.**



టపాకాయల వ్యాపారంలోనూ అవినీతి పర్వం.

దీపావళి పండుగను పురస్కరించుకొని శివకాశి నుంచి కోట్ల రూపాయల విలువచేసే టపాసులు జిల్లాకు చేరుకొన్నాయి. జిల్లాకు భారీ వాహనాల ద్వారా తీసుకొస్తున్న టపాసులకు చెల్లించాల్సిన పన్నులను చెల్లించడం లేదు. జిల్లా సరిహద్దులో వున్న ఉమ్మడి తనిఖీ కేంద్రంలో విధులు నిర్వహిస్తున్న వాణిజ్య పన్నుల అధికారులు చేతివాటం ప్రదర్శించడం ఇందుకు కారణంగా భావించవచ్చు.

## వాణిజ్య పన్నుల శాఖ కుమ్మక్కు!

టపాసుల విక్రయాలకు సంబంధించిన బిల్లులను పూర్తిగా పరిశీలించకపోవడంతోపాటు తనిఖీ చేసినట్లు కార్యాలయం ముద్ర వేయకుండానే వదిలేస్తున్నారు. వాణిజ్య పన్నుల శాఖ అధికారులు ఇలా చేయడం వ్యాపారులకు బాగా కలిసి వస్తుంది. ఒకే బిల్లుతో మూడు, నాలుగు దఫాలు టపాసులు దిగుమతి చేసుకొనేందుకు అవకాశం ఏర్పడుతుంది. శివకాశి నుంచి కొనుగోలుచేసి తీసుకొస్తున్న టపాసులకు మన రాష్ట్రంలో పన్ను చెల్లించాల్సి వుంటుంది. పన్నులు చెల్లిస్తే ఆదాయం పోతుందన్న కారణంతో సంబంధిత శాఖ అధికారులతో ముందుగానే వ్యాపారులు ఒప్పందం కుదుర్చుకొంటున్నారు.

అధికారులు మామూళ్ల కోసం కక్కుర్తిపడి ప్రభుత్వ ఖజానాకు చేరాల్సిన ఆదాయానికి గండి కొడుతున్నారు. ప్రతి సంవత్సరం ఇదే తంతు జరుగుతున్నా ప్రభుత్వం నుంచి ఎటువంటి స్పందన కానరావడం లేదు. ప్రతి సంవత్సరం దీపావళికి జిల్లా వ్యాప్తంగా దాదాపు మూడు కోట్ల రూపాయల వ్యాపారం జరుగుతుంది. జిల్లాలో ముగ్గురు వ్యాపారులే శివకాశి నుంచి టపాసులు తీసుకొచ్చి ఇక్కడ రిటైల్‌గా చిన్న వ్యాపారులకు విక్రయాలు జరుపుతుంటారు. మూడు కోట్ల రూపాయలకు టపాసులు కొనుగోలు తాలుకు వాణిజ్య పన్నుల శాఖకు 30 లక్షలకు పైగా పన్ను చెల్లించాల్సి వుంటుంది.

## వ్యాపారుల కోటరి!

ఈ వ్యాపారంలో బాగా ఆదాయం గడించిన ఈ ముగ్గురు వ్యాపారులు మరొకరు తమకు పోటీకి రాకుండా వుండేందుకు అనుమతులు రాకుండా అడ్డుకొంటున్నారన్న ఆరోపణలు వున్నాయి. అధికారులకు సైతం ఆశించిన దానికంటే రెట్టింపు ఆదాయం వస్తుండడంతో వీరికి అనుకూలంగా వ్యవహరిస్తూ పోతున్నారన్న విమర్శలున్నాయి. టపాసులు దిగుమతి చేసే విషయం గురించి ముందుగా వాణిజ్య పన్నులశాఖ నుంచి వే బిల్లులు పొందాల్సి వుంటుంది. ఒకవేళ వే బిల్లులు పొందకుంటే కొనుగోలు చేసిన బిల్లులు, రశీదులు చూపించి ప్రభుత్వానికి పన్ను చెల్లించాలి, ఒకసారి పన్ను చెల్లించి పొందిన రశీదునే మరొకసారి కూడా చూపిస్తూ ప్రభుత్వాన్ని మోసం చేస్తుంటారు.

## సమన్వయ లోపం

టపాసులు దిగుమతి చేసుకొనే వ్యాపారులు పైవిధంగా వ్యవహరిస్తుంటే తయారుకు, విక్రయాలకు లైసెన్స్ జారీ చేసే విషయంలో అగ్నిమాపకశాఖ, రెవిన్యూ శాఖలు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయి. నెల్లూరు నగరంలోని పొర్లుకట్ట సమీపంలో బాణ సంచా తయారీ జరుగుతుంది. ఈ బాణాసంచా తయారీ కేంద్రాలకు కూతవేటు దూరంలో ప్రజలు నివాసం వుంటున్నారు. అనుకోనివిధంగా ఏదైనా ప్రమాదం సంభవిస్తే భారీస్థాయిలో ప్రాణ నష్టం, ఆస్తి నష్టం జరుగుతుంది.

గతంలో ఇదే ప్రాంతంలో రెండు, మూడు దఫాలు ప్రమాదాలు జరిగిన సంఘటనలున్నాయి. ఈ ప్రమాదంలో ఎనిమిది మంది వరకు ప్రాణాలు కోల్పోయారు. ప్రమాదాలు జరుగుతున్న విషయం అగ్నిమాపక, రెవిన్యూ శాఖల అధికారులు, పోలీసులకు తెలిసినా కూడా నివారణకు ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. సంఘటన జరిగిన తర్వాత బాణ సంచా తయారీ కేంద్రాలపై తనిఖీకి వెళ్లి యజమానులకు హెచ్చరికలు జారీ చేయడం, లేదా అపరాధ రుసుం విధించడం వంటి చర్యలు చేపడుతున్నారే తప్ప, లైసెన్సులను మాత్రం రద్దు చేయడం లేదు. దీంతో యజమానులకు షరా మామూలై పోయింది.

నవంబర్ 5వ తేదీన దీపావళి పండుగను పురస్కరించుకొని పొర్లుకట్ట ప్రాంతంలో వున్న బాణ సంచా తయారీ కేంద్రంలో టపాసులు తయారీ అధికంగా చేపట్టారు. ఇక్కడ విక్రయించే టపాసులకు ఎటువంటి బిల్లులు ఇవ్వరు. మరో ప్రక్క నగరంలోని ట్రంకురోడ్డులో చిన్నచిన్న దుకాణాలలో టపాసులు విక్రయించుకొనేందుకు అనుమతులు మంజూరయ్యాయి. విక్రయదారులు లైసెన్స్ కోసం రెవిన్యూ శాఖకు దరఖాస్తు చేస్తే అభ్యంతరం కోసం అగ్నిమాపక శాఖకు పంపుతారు. విక్రయించే ప్రదేశాన్ని అగ్నిమాపక శాఖ అధికారులు క్షుణ్ణంగా పరిశీలన చేసి ప్రమాదాలు సంభవిస్తే జరిగే నష్టాలను అంచనావేసి, అభ్యంతరం లేదని తెలియజేస్తే లైసెన్స్ మంజూరవుతుంది. అభ్యంతరాలు వ్యక్తం చేస్తే టపాసుల విక్రయాలకు రెవిన్యూ అధికారులు లైసెన్స్ మంజూరుచేసే వీలుండదు.

నగరం నడిబొడ్డున రోడ్డుకు ఆనుకొని టపాసులు విక్రయించడం అందరం చూస్తూనే వుంటాం. వూహించని విధంగా ఏదైనా ప్రమాదం చోటు చేసుకొంటే జరిగే నష్టాన్ని ఎవరూ అంచనా వేయలేరు. జన సంచారం వుండే చోట టపాసుల విక్రయాలకు లైసెన్స్ మంజూరుచేసే సమయంలో కఠిన నిబంధనలు వుంటాయి. ఈ నిబంధనలు కేవలం కాగితాలకే పరిమితమై వున్నాయి. ఆచరణలో ఏమాత్రం అమలుకు నోచుకోకపోవడంతో నిర్వాహకులది ఇష్టారాజ్యమయ్యింది.



నెల్లూరు పెద్దాస్పత్రిలో ఆకస్మిక తనిఖీ చేసి రోగుల నుండి సమాచారాన్ని అడిగి తెలుసుకొంటున్న మంత్రి రామనారాయణరెడ్డి.



నెల్లూరు ఐసిడిఎస్ కార్యాలయంలో అంగన్‌వాడీ సూపర్‌వైజర్ల నుంచి సంస్థ పనితీరు వివరాలను రాబడుతున్న తిరుపతి ఎమ్పీ చింతామోహన్.




నెల్లూరు ఎసినగర్‌లోని ఎంఎస్‌ఎం వున్నత పాఠశాలలో పదవ తరగతి చదివి అత్యధిక మార్కులు తెచ్చుకొన్న విద్యార్థిని బి.లక్ష్మికి శ్రీరామ్ గోపాలయ్య స్మారకార్థం ఆయన కుమారుడు భగవాన్ ఆర్థిక సహాయం చేస్తున్న దృశ్యం. ప్రక్కన రక్తదాత వైవి.సుబ్బారావు.



మలేషియాలో నవ్వుల్ నవ్వుల్ కార్యక్రమాన్ని నిర్వహించి వచ్చిన మురళీఆర్ట్స్ అధినేత శింగంశెట్టి మురళీమోహన్‌ను సన్మానిస్తున్న కార్పొరేషన్ సూపరింటెండెంట్ ఇంజనీర్ ఎం.ఎస్.జ్యోతి, డ్వామా ప్రాజెక్ట్ డైరక్టర్ సుస్మితారెడ్డి, బివి.నరసింహం.

# వైఎస్ చేసిన మేలు మరవగలరా?

## ఓదార్పులో ప్రశ్నించిన జగన్

రాష్ట్ర ప్రజల సంక్షేమం కోసం ఎన్నో వినూత్న పథకాలను ప్రవేశపెట్టి ప్రజల హృదయాల్లో నిలిచిన వ్యక్తి దివంగత మాజీ ముఖ్యమంత్రి వై.ఎస్.రాజశేఖర్‌రెడ్డి అని కడప ఎమ్పీ జగన్మోహన్‌రెడ్డి కొనియాడారు. ఓదార్పు యాత్రలో భాగంగా కావలి మండలంలో పర్యటించిన ఆయన తన తండ్రి ప్రవేశపెట్టిన పలు పథకాలను వాటి వల్ల ప్రజలకు కల్గిన ఉపయోగాన్ని ప్రస్తావించారు. చదువుకొనే విద్యార్థుల వద్ద నుంచి మత్స్యకారుల వరకు ప్రతి ఒక్కర్రూ బాగుండాలన్న సదుద్దేశంతో ఎన్నో సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టారన్నారు. మహిళా సాధికారిత కోసం పావలా వడ్డీకి రుణాలను అందజేసి ప్రతి కుటుంబంలో ఆర్థిక పరిపుష్టికి కారణమయ్యారని వివరించారు. రైతాంగానికి ఉచిత విద్యుత్, వృద్ధులు, వికలాంగులు, వితంతువులకు ఫించన్లు అందచేసి ఆయా కుటుంబాలకు జీవించే భరోసా కల్పించారన్నారు. ముస్లింలకు నాలుగుశాతం రిజర్వేషన్లు, ప్రతి ఒక్క పేదవాడు కార్పొరేట్ వైద్యం అందుకొనేలా ఆరోగ్యశ్రీ కార్డు సృష్టించిన ఘనత వైఎస్‌దేనన్నారు. అలాంటి మహానేత ప్రజలందరి హృదయాల్లో జీవించే వున్నారని నివాళులు అర్పించారు. ఈ యాత్రలో ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి, పిసిసి కార్యదర్శి వినయ్‌కుమార్‌రెడ్డి, డిసిసి అధ్యక్షుడు ఎల్లసిరి గోపాలరెడ్డి తదితరులు పాల్గొన్నారు.



ఓదార్పు సభలో మాట్లాడుతున్న వైఎస్.జగన్మోహన్‌రెడ్డి.

## మత్తులో కావలి డాబాలు

కావలి రూరల్ మండలంలోని జాతీయరహదారిని ఆనుకొని వున్న డాబాల్లో మద్యం విక్రయాలు బహిరంగంగా జరుగుతున్నాయి. సాయంత్రం అయినప్పటి నుంచి డాబాలు మద్యం త్రాగే వారితో కిక్కిరిసి వుంటున్నాయి. దగదర్తి, సున్నపుబట్టి, దామవరం, ఉలవపాళ్ల, గౌరవరం, మద్దూరుపాడు తదితర ప్రాంతాల్లోని డాబా హోటళ్లలో అదే తంతు. లారీ డ్రైవర్లు, వివిధ వాహనాలపై వెళ్లేవారు డాబాల్లో మద్యం సేవించి వాహనాలను నడుపుతుండడంతో తరచూ

### కట్టడిచేసే అధికారే లేదు

ప్రమాదాలకు కారణం అవుతున్నాయి. ఈ డాబాల్లో నిబంధనల ప్రకారం మద్యం విక్రయాలు జరుపరాదు. కానీ బహిరంగంగా మద్యాన్ని అమ్ముతున్నా పోలీసులు, ఎక్సైజ్ అధికారులు పట్టించుకోకపోవడంతో డాబాల నిర్వాహకులది ఇష్టారాజ్యం అయ్యింది. జిల్లా కలెక్టర్ రాంగోపాల్ డాబాల్లో మద్యం విక్రయాలను అరికట్టాలని అధికారులకు ఆదేశాలు జారీ చేసినా చలనం లేకుండా పోయింది.

## తడకలూరు చెరువు దురాక్రమణ!

దగదర్తి మండలంలోని తడకలూరు చెరువు ఆక్రమణలకు గురౌతోంది. చెరువు పైభాగంలో పలువురు ఆక్రమణలకు పాల్పడడంతో కుంచించుకపోతోందని, సాగుకు నీరు అందని పరిస్థితి ఏర్పడిందని రైతులు వాపోతున్నారు. ఈ సమస్యపై పలుమార్లు అధికారులకు ఫిర్యాదు చేసినప్పటికీ ఫలితం లేకుండా పోయింది

### సాగునీరు అందడం లేదు

దని వాపోతున్నారు. మరికొందరు కబ్జాదారులు జెసిబిలను తీసుకవచ్చి సాగుకు సమాయత్తం అవుతున్నా పట్టించుకొనేవారే లేకుండా పోయారని స్థానికులు గోడుగోడు మంటున్నారు. 176 ఎకరాల ఆయకట్టు చెరువు క్రింద వుందని దీనిని దృష్టిలో వుంచుకొని చెరువును కబ్జాదారుల నుంచి కాపాడాలని రైతులు కోరుకొంటున్నారు.

## నిత్యావసరాల ధరలు నియంత్రించాలి!

రాష్ట్రంలో పెరిగిన పెట్రోలు, డీజిల్, నిత్యావసర వస్తువుల ధరలను ప్రభుత్వం నియంత్రించాలని ప్రజారాజ్యంపార్టీ డిమాండ్ చేసింది. కావలిలో ధరల పెరుగుదలను నిరసిస్తూ ఆ పార్టీ నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ఆర్‌డిఓ వెంకటేశ్వర్లుకు

### కావలిలో ప్రజారాజ్యం నిరసన

వినతిపత్రం అందజేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ధరల పెరుగుదల వలన సామాన్య ప్రజలు జీవించలేని పరిస్థితి ఎదురౌతున్నదని, ఏది కొనాలన్నా ధరలు చుక్కలనంటుతుండడంతో తిండి తినలేని పరిస్థితి నెలకొనిందన్నారు. ఈ కారణంగా పేద, మధ్యతరగతి కుటుంబాలు వీధిన పడుతున్నాయని, బ్రతుకు భారమైందన్నారు. దీని వలన మైక్రోఫైనాన్స్‌ల బారిన పడి చివరకు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారని ఆవేదన చెందారు. ప్రభుత్వం బియ్యాన్ని రైతు బజార్ల ద్వారా ప్రజలకు తక్కువ ధరకే అందించాలని, నిత్యావసర వస్తువుల ధరలను తగ్గించాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో ప్రజారాజ్యం పార్టీ నాయకులు చింతాల వెంకట్రావు, షాహుల్ హమీద్, జ్యోతిశ్రీ, వెంకట్రామిరెడ్డి, శ్రీనివాసులు, శ్రీహరి తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరు రచయిత్రి డాక్టర్ జయప్రదకు ఒంగోలులో హసన్ ఫాతిమా స్మారక సాహిత్య పురస్కారాన్ని అందజేస్తున్న జడ్పీ ఛైర్మన్ కాటం అరుణమ్మ.

## టిపి గూడూరును మరచిన ఆదాల

సర్వేపల్లి నియోజకవర్గంలోని వివిధ ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించే శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి అదే నియోజకవర్గంలోని తోటపల్లి గూడూరు మండలాన్ని పట్టించుకోవడం లేదనే విమర్శలు వినవస్తున్నాయి. ఎమ్మెల్యే ఇటీవల కాలంలో తరచూ పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న ముత్తుకూరు, వెంకటాచలంతోపాటు పొదలకూరు మండలంలో వివిధ కార్యక్రమాలలో పాల్గొంటూ ప్రజల సమస్యలను తెలుసుకొంటున్నప్పటికీ టిపి గూడూరు మండలం వైపు కన్నెత్తి చూడకపోవడమే ఈ విమర్శలకు కారణం. మండలాధ్యక్షుడిగా టంగుటూరి శ్రీనివాసులరెడ్డి యాష్‌పాండ్ వ్యవహారమై విభేదించడంతోపాటు ఎడమొహం పెడమొహంగా వుంటుండడం, కొందరు మండల కాంగ్రెస్ నేతల వైఖరితో ఆదాల మనస్తాపం చెందినందువల్లే టిపి గూడూరును పట్టించుకోవడం లేదనేది కొందరు వ్యక్తం చేస్తున్న అభిప్రాయం. జిల్లాలో జగన్ చేపట్టిన ఓదార్పు యాత్రకు సర్వేపల్లి నుంచి తన అనుచరులు కొందరు సహకరిస్తుండడపైనా ఆదాల ప్రభాకర్‌రెడ్డి కినుక వహించినట్లు సమాచారం.

## భద్రంగా పేడూరు వేణుగోపాలుని నగలు

రాష్ట్రవ్యాప్తంగా ఇటీవల కాలంలో దేవుళ్ల నగలపై నీలినీడలు కమ్ముకొన్న నేపథ్యంలో తోటపల్లి గూడూరు మండలం పేడూరు వేణుగోపాలస్వామి నగలు భద్రంగా వున్నాయి. శ్రీ వేణుగోపాలస్వామి, అమృతేశ్వరి ఆలయాలకు చెందిన 12 సవర్ల ఆభరణాలను 1987లో నెల్లూరు సెంట్రల్ బ్యాంక్ లాకర్‌లో భద్రపరిచారు. వీటిని భద్రపరచి 23 సంవత్సరాలు కావడం ఆనాటి నుంచి వాటిని బయటపెట్టక పోవడంతో మండలంలో దేవుళ్ల నగలపై పలు అనుమానాలు వ్యక్తమయ్యాయి. వీటిని నివృత్తి చేసేందుకు దేవాదాయశాఖ నడుంబిగించింది. బ్యాంక్ లాకర్ తెరచి చూడగా నగలు చెక్కు చెదరకుండా వుండడంతో అందరు సంతోషించారు.

## సూళ్లూరుపేట గ్రామానికి కరెంటు కట్

సూళ్లూరుపేట గ్రామ పంచాయితీకి విద్యుత్‌శాఖ విద్యుత్ సరఫరా తొలగించింది. విద్యుత్ బకాయిల చెల్లింపులో పంచాయితీ నిర్లక్ష్యంగా వ్యవహరించడం, లక్షల రూపాయలు పేరుకపోవడంతో విద్యుత్ శాఖ కొరడా విదిల్చింది. బకాయిల్లో కొంతైనా చెల్లించాలని చెప్పినా పంచాయితీ పాలకవర్గం పట్టించుకోకపోవడంతో సరఫరా తొలగించారు. దీంతో వీధి దీపాలు వెలగక అంధకారం అలుముకొంది. గ్రామంలో చీకట్లు ముసురుకోవడంతో దొంగతనాలు జోరందుకొన్నాయని పంచాయితీ పాలకవర్గం తక్షణం బకాయిలు చెల్లించి గ్రామానికి విద్యుత్ సరఫరా పునరుద్ధరించాలని స్థానికులు కోరుకొంటున్నారు.

## గిరిజనుల సమస్యల పరిష్కారానికి కృషి

జిల్లావ్యాప్తంగా గిరిజన గ్రామాల్లో పర్యటించి వారు ఎదుర్కొంటున్న సమస్యలను గుర్తించి వాటిని పరిష్కరించేందుకు కృషి చేస్తామని గిరిజన ఐక్య వేదిక జిల్లా నాయకుడు కత్తి ఆదిశేషయ్య తెలిపారు. వెంకటగిరిలో జరిగిన ఐక్య వేదిక సమావేశంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ గిరిజనుల సమస్యల పరిష్కారం కోసం ప్రణాళికాబద్ధంగా కృషి చేస్తామని వివరించారు. ఈ సమావేశంలో ప్రచార కార్యదర్శి రావూరు ప్రసాద్, మార్పు సంస్థ అధ్యక్షుడు చిగురుపాటి పవన్, ఆంధ్రప్రదేశ్ యానాది సంఘం ఉపాధ్యక్షురాలు యాకసిరి నాగమణి తదితరులు పాల్గొన్నారు.

# సోమిరెడ్డిని తిట్టిన ఆదాల!

**విద్యుత్ ప్లాంట్ల వివాదమే కారణం**





విద్యుత్ ప్లాంట్ల పేరుతో ప్రజల్లో లేనిపోని అపోహలు సృష్టించి డబ్బుగుంజే కార్యక్రమానికి టిడిపి నేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పాల్పడుతున్నారని సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి ఆరోపించారు. మనుబోలులో పర్యటించిన ఆయన నియోజకవర్గ పరిధిలో ఏర్పాటవుతున్న విద్యుత్ ప్లాంట్ల గురించి మాట్లాడారు. ధనార్జనే ధ్యేయంగా సోమిరెడ్డి అసత్య ప్రచారానికి దిగుతున్నాడని ఘాటైన వ్యాఖ్యలు చేశారు. అత్యంత ఆధునికంగా నిర్మితమవుతున్న ఈ ప్లాంట్ల వలన ఎలాంటి హానీ జరుగదని, కాలుష్యం కల్గదన్నారు. పరిశ్రమల ఏర్పాటు వలన జరుగుతున్న అభివృద్ధిని అభినందించాల్సిందిపోయి దుష్ప్రచారం చేయడం తగదన్నారు. దివంగత రాజశేఖర్‌రెడ్డి ప్రవేశపెట్టిన పథకాలను యథావిధిగా కొనసాగిస్తూ ముఖ్యమంత్రి రోశయ్య అందరి మన్ననలు అందుకొంటున్నారని తెలిపారు. ఈ సందర్భంగా ఆదాల వికలాంగులు, వితంతువులు, వృద్ధులకు పింఛన్లు పంపిణీ చేశారు. దీపం పథకం క్రింద గ్యాస్ కనెక్షన్లు అందించారు.

## 2010నాటికి విద్యుత్ ఉత్పత్తి

### ఎపిజెన్‌కో సిఎండి ప్రకటన

నేలటూరులో నిర్మాణంలో వున్న 1600 మెగావాట్ల జెన్‌కో విద్యుత్ ప్రాజెక్టు మొదటి దశ ఉత్పత్తి 2012 సంవత్సరం ఆఖరున ప్రారంభం అవుతుందని ఎపిజెన్‌కో సిఎండి విజయానంద్ తెలిపారు. దేశంలో ప్రప్రథమంగా సూపర్ క్రిటికల్ టెక్నాలజీతో నేలటూరులో ఏర్పాటవుతుందన్నారు. బాయిలర్ ఎరక్షన్ పనులను బిహెచ్ఇఎల్, అల్‌స్టామ్ సంస్థలు నిర్వహిస్తున్నాయని త్వరలో ఈ పనులు కూడా పూర్తవుతాయన్నారు. దీనికి సంబంధించి పరికరాలను విదేశాల నుంచి దిగుమతి చేసుకొంటున్నట్లు తెలిపారు.

## మహిళలను అక్షరాస్యులు చేస్తాం!

**వయోజన విద్యాశాఖ డైరెక్టర్ కుమార్**

జిల్లాలో సాక్షర భారత్ ద్వారా మహిళలను అధిక సంఖ్యాలో అక్షరాస్యులను చేసేందుకు కృషి చేస్తున్నట్లు వయోజన విద్యాశాఖ డైరెక్టర్ కుమార్ పేర్కొన్నారు. వెంకటగిరి వచ్చిన ఆయన సాక్షరభారత్ అమలు తీరుపై అధికారులతో సమీక్షించారు. జిల్లాలో 60వేల మంది మహిళలను అక్షరాస్యులుగా చేయాలన్న లక్ష్యంతో పని చేయాలని ఇందు కోసం 6వేల కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. ఎస్సీ, ఎస్టీ, మైనార్టీ వర్గాలపై ప్రత్యేక దృష్టి సారించాలని సిబ్బందికి సూచించారు. జిల్లాలో కోఆర్డినేటర్ల ఎంపిక 13 పంచాయితీల్లో కొన్ని కారణాల వలన నిలచిపోయిందని, మిగతా అన్ని ప్రాంతాలలో నియామకాలు జరిగాయన్నారు. ఈ కార్యక్రమంలో ఎపిఓ కృష్ణకుమారి, ఎంపిడిఓ బాలాజీ, సమన్వయకర్త జనార్దన్ పాల్గొన్నారు.

# కలువాయిలో కీచక డాక్టర్

వైద్యుడిని దేముడితో సమానంగా గౌరవిస్తారు. కానీ కలువాయి మండలంలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రం డాక్టర్ సందానీ బాష వైద్య వృత్తికే కళంకం తెచ్చేలా వ్యవహరిస్తుండడం పట్ల మండలంలో గగ్గోలు రేగుతోంది. పూటుగా మద్యం సేవించి విధులకు హాజ కాక అవినీతిలోనూ అందెవేసిన చేయని రుజువు చేసుకొంటున్నాడు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయకుండానే చేసినట్లు చూపగా అందులో ఎన్ని సక్రమమైనవో అధికారుల విచారణలో తేలాల్సివుంది. ఈ డాక్టర్‌పై ఫిర్యాదులు వెళ్లగా విచారణకు వచ్చిన ఫ్యామిలీ ప్లానింగ్ ఎవ

### మహిళా సిబ్బంది పట్ల అనుచిత ప్రవర్తన

ల్యుయేషన్ కమిటీకి నెల్లూరు నగరంలోని స్టార్ హోటల్లో విందు, మందు పార్టీ ఇచ్చి తన అవినీతి పొక్కకుండా చేసుకొన్నాడట. ఈ పార్టీకి అయిన ఖర్చు 12వేల రూపాయలను క్రింది స్థాయి సిబ్బంది నుంచి వసూలు చేస్తున్నాడట.

రయ్యే ఈ ప్రబుద్ధుడు మహిళా సిబ్బంది పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తూ లైంగిక వేధింపులకు పాల్పడుతున్నాడట. ఈ డాక్టర్ వికృత చేష్టలు బయటకు చెప్పుకోలేక మహిళలు కన్నీళ్ల పర్యంతమవుతున్నారు. డాక్టరు మహిళల పట్ల అసభ్యంగా ప్రవర్తించడమే

## పని చేయనివారిని ఇంటికి పంపండి!

విధి నిర్వహణలో అలసత్వం ప్రదర్శించే వారిని వెంటనే తొలగించాలని, మునిసిపాలిటీలో పారిశుద్ధ్యాన్ని మెరుగుపరచాలని వెంకటగిరి మునిసిపాలిటీ స్పెషల్ ఆఫీసర్ రామ్మూర్తి కమిషనర్ పుల్లారావును ఆదేశించారు. మునిసిపాలిటీ తీరుతెన్నులపై ఆయన సమీక్ష జరిపారు. కాంట్రాక్టు సిబ్బంది అధిక సంఖ్యాలో వున్నప్పటికీ ఎలాంటి ప్రయోజనం లేకుండాపోతోంది. నెలనెలా జీతాలు తీసుకోవడం తప్ప ఫలితం వుండడం లేదు. నా వద్ద అందరి గురించి పూర్తి సమాచారం వుంది. వాటర్‌వర్క్స్ విభాగంలో అనవసరంగా ఎక్కువ మంది పని చేస్తున్నారు. అసలే రాబడి లేక అప్పుల్లో వున్న మునిసిపాల్టీకి వీళ్ల అదనపు భారం అవుతున్నారని వ్యాఖ్యానించారు. ఇంటిపన్ను, నీటి పన్నుల వసూళ్లను వేగవంతం చేయాలని సూచించారు. విద్యుత్ బకాయిలు త్వరగా చెల్లించేందుకు చర్యలు చేపట్టాలన్నారు.

## చేతులు కడుక్కొంటున్న రోశయ్య



ప్రభుత్వంలో కీలక నిర్ణయాలపై సంతకం పెట్టడానికి రోశయ్య వెనకాడుతున్నాడు. ప్రభుత్వపరంగా ఏదైనా కీలక నిర్ణయం తీసుకోవాల్సి వస్తే ముందుగా సంబంధిత మంత్రి స్థాయిలో సిఫార్సు చేయాలి. అయితే మంత్రులు తమకెందుకొచ్చిన తంటా అంటూ కీలక ఫైళ్లను సిఎంకు తోసేస్తున్నారు. దీంతో రోశయ్యకు చికాకు ఎక్కువైంది. డిఎస్‌సి నియామకాలు, ప్రభుత్వ న్యాయవాదుల నియామకాల్లో ప్రాంతాల వారీ కోటా, ప్రభుత్వ భూముల కేటాయింపు, జలయజ్ఞం బిల్లుల చెల్లింపు, విద్యార్థుల ఫీజు రీఎంబర్స్‌మెంట్ తదితర నిర్ణయాలకు సంబంధించి మంత్రుల సిఫార్సులు లేకుండా నేరుగా వచ్చిన ఫైళ్లను ఇప్పటికే రోశయ్య తిప్పి పంపాడు. మంత్రుల వైఖరితో చికాకుగా వున్న రోశయ్య ఇటీవల మంత్రులకు ప్రత్యేక క్లాస్ కూడా తీసుకున్నాడట. ప్రభుత్వం అంటే సిఎం మాత్రమే కాదు... మంత్రులు కూడా అంటూ.. హితబోధ చేశాడు. అయితే ఏం నిర్ణయం తీసుకుంటే ఏమవుతుందో అన్న ధోరణి మంత్రుల్లో వుంది. చూద్దాం... ఏమవుతుందో..!

## ముఖ్యమంత్రి చెప్పారట?



ముఖ్యమంత్రికి సన్నిహితంగా వున్నాం... మా యిష్టం వచ్చింది చేస్తాం... అడిగే వాళ్లెవరంటూ కొందరు ఐఎఎస్ అధికారులు బరితెగించి ప్రవర్తిస్తున్నారు. ఇందులో ముఖ్యమంత్రి సామాజిక వర్గానికి చెందిన మార్కెటింగ్ కమిషనర్ ఎ.ఆర్.సుకుమార్, జలమండల ఎం.డి.జగదీశ్వర్... నవీన్ మిట్టల్ వంటి వారైతే తమకు ఎదురు లేదన్నట్లుగా వ్యవహరిస్తున్నారని ఐఎఎస్ వర్గాలు చెవులు కొరుక్కొంటున్నాయి. ముఖ్యమంత్రి పేరుతో వీరు సొంత నిర్ణయాలు తీసుకోవడం సంబంధిత మంత్రులకు, ప్రిన్సిపల్ కార్యదర్శులకు తలనొప్పిగా తయారైంది. సిఎం క్యాండిడేట్లు మనం ఏంచేస్తాం అంటూ ఆ మధ్య ప్రధాన కార్యదర్శి ఎస్.వి.ప్రసాద్ కూడా నీళ్లు నమిలాడట. దీంతో ఈ ఐఎఎస్‌ల ఆగడాలకు అంతులేకుండా పోతోందట. వింటున్నారా రోశయ్య! సొంత సామాజిక వర్గం అంటూ అలుసిస్తే పోయేది ఎవరి పరువో ఒక్కసారి ఆలోచించండి!!

## 'వట్టి'కి రోశయ్య మొట్టికాయ



గ్రామీణాభివృద్ధి మంత్రి వట్టి వసంతకుమార్‌కు రోశయ్య మొట్టికాయ వేశారు. జగన్‌కు అత్యంత సన్నిహితుడిగా మెలుగుతున్న 'వట్టి'పై రోశయ్యకు మొదటి నుంచీ కష్టంగానే వుంది. 'వట్టి' వ్యవహారాలపై రోశయ్య 'ఇంటెలిజెన్స్' కన్ను వేసి వుంచాడు. 'వట్టి' జగన్‌ను కలిసిన తెల్లారే 'సాక్షి' పత్రికలో ప్రభుత్వ నిర్ణయాలకు వ్యతిరేకంగా పతాక శీర్షికలో వార్తలు వస్తున్నాయట. ఆ మధ్య జరిగిన ఓ సమావేశంలో రోశయ్య ఇదే విషయాన్ని ముఖం మీదే అనే సరికి వట్టి ఖంగుతిన్నాడు. ఏమయ్యా వట్టి... జగన్‌ను కలిసి ఏం చెబుతున్నావో ఏమోగానీ తెల్లారే సాక్షిలో చెత్తంతా కనిపిస్తోందంటూ రోశయ్య అసహనం ప్రదర్శించడాన్ని వట్టి జీర్ణించుకోలేకపోతున్నాడట! ప్చ్... ఏంచేద్దాం!

## 'దేశం' ఢిల్లీ యాత్రపై 'రగడ'




పాపం చంద్రబాబుకు 'తెలంగాణ' గుదిబండలా తయారైంది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోరుతూ తెలంగాణ ప్రాంతం 'దేశం' నాయకులు ఢిల్లీ యాత్ర చేపట్టారు. దీనికి 'బాబు' పచ్చజెండా ఊపినట్లు దాఖలాలు లేవు. దీంతో సీమాంధ్ర దేశం నాయకులు ఢిల్లీయాత్రకు, పార్టీకి సంబంధం లేదంటూ ప్రకటనలు చేస్తున్నారు. వీరిద్దరి మధ్య 'బాబు' అడకత్తెరలో పోక చెక్కలా తయారయ్యాడు. ఢిల్లీ యాత్రను సమర్థిస్తే సీమాంధ్ర నుంచి తంటా... అలాగని కాదంటే తెలంగాణ తమ్ముళ్ల నుంచి బెదిరింపులు... కరవ మంటే కప్పకు... వదల మంటే పాముకు కోపం అన్నట్లుంది పాపం 'బాబు' పరిస్థితి.



## కెవిపిపై శంకర్రావు కన్నెర్ర

రాష్ట్రప్రభుత్వ సలహాదారు కె.వి.పి.రామచంద్రరావుపై కంటోన్మెంట్ ఎమ్మెల్యే శంకర్రావు దుమ్మెత్తిపోస్తున్నాడు. వైఎస్ హయాంలో తనకు మంత్రిపదవి రాకుండా కె.వి.పి అడ్డుపడ్డాడట. ఇప్పుడు రోశయ్య పక్కన చేరి మంత్రివర్గ విస్తరణ జరక్కుండా మోకాలడ్డుతున్నాడన్నది శంకర్రావు అనుమానం. దీంతో కె.వి.పిని రచ్చకు లాగుతున్నాడు. రాష్ట్రప్రభుత్వ సలహాదారుగా కె.వి.పి ఏంచేస్తున్నాడంటూ పత్రికలకెక్కాడు. కె.వి.పి.ని వెంటనే ప్రభుత్వ సలహాదారుగా తొలగించాలంటూ రోశయ్యకు అల్టిమేటం కూడా జారీ చేశాడు. పాపం శంకర్రావు! వ్రతం చెడ్డా ఫలితం దక్కుతుందో లేదో!

## సన్నబడుతున్న 'చిరు'



ప్రజారాజ్యం పార్టీ పెట్టి సినిమాలకు గుడ్‌బై చెప్పాక చిరంజీవి కాస్తంత లావెక్కాడు. ఎలాగూ సినిమాలు లేవు కాబట్టి ఎలా వుంటే ఏంలే అనుకున్నాడేమో! బరువు బాగా పెరిగాడు. ఇప్పుడు మళ్లీ సినిమాలో నటించాలన్న నిర్ణయం తీసుకున్నాక సన్నబడటం మొదలు పెట్టాడు. ఆ మధ్య ఎవరికీ చెప్పకుండా అమెరికా వెళ్లి నిపుణుల సలహాలు తీసుకున్నాడట. ఇప్పుడు ప్రతిరోజు శిక్షకుడ్ని పెట్టుకుని మరీ వ్యాయామాలు చేస్తున్నాడు. రోజు రోజుకూ సన్నబడుతున్న చిరంజీవిని చూసి అభిమానులు తెగ ముచ్చట పడిపోతున్నారు. తెరపైకి వచ్చేలోగా ఇంకెలా వుంటాడో... చూద్దాం!!



ఆత్మకూరులో డాక్టర్ ఆదిశేషయ్య చిన్నపిల్లల ఆస్పత్రిని ప్రారంభిస్తున్న మంత్రి రామనారాయణరెడ్డి. ప్రక్కన డాక్టర్ ఆదిశేషయ్య, ఎమ్మెల్సీ రాఘవేంద్రరెడ్డి, మాజీ ఎమ్మెల్యే డాక్టర్ సుందరరామిరెడ్డి.




నెల్లూరు నగరంలో పేద ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కరించాలంటూ సిపిఎం చేస్తున్న రిలే నిరాహార దీక్షలకు మద్దతు ప్రకటించి మాట్లాడుతున్న సిపిఐ జిల్లా కార్యదర్శి పముజుల దశరథరామయ్య.



## జగతిని జాగృతం చేసి

# చైతన్య దీప్తులు వెలిగించే శోభావళి దీపావళి!

భారతీయ సంస్కృతి సాంప్రదాయాలకు ప్రతిబింబం పండుగలు. అలాంటి పండుగల్లో ఆశ్వీయుజ బహుళ అమావాస్య నాడు వచ్చే దీపావళి పండుగకు ఎంతో విశిష్టత వుంది. జాతి, కుల, మత వర్గ విభేధాలను విస్మరించి సమైక్యంగా జరుపుకొనే పండుగ దీపావళి. జగతిని జాగృతం చేసి చైతన్య దీప్తులు వెలిగించే శోభావళి దీపావళి. ప్రతి ఏటా ఆశ్వీయుజ అమావాస్య రోజున దీపావళిని, ముందురోజున వచ్చే బహుళ చతుర్దశిని నరక చతుర్దశిగా జరుపుకోవడం ఆనవాయితీ.

చీకటిని పారద్రోలి వెలుగులు తెచ్చే పండుగగా, విజయానికి ప్రతీకగా దీపావళి పండుగను చెప్పుకొంటారు. నూతన వస్త్రాల రెపరెపలు, దీపాలతో శోభాయమానంగా ప్రకాశించే గృహాలు, చిన్నారుల ఆనందోత్సాహాలు, పిండివంటల ఘుమ ఘుమలు, బాణాసంచా చప్పుళ్లు దీపావళి సోయగాలు. దీపావళి పండుగకు సంబంధించి పురాణ కథ ఒకటి వుంది. కృతయుగంలో హిరణ్యాక్షుని వధించిన వరాహస్వామికి, భూదేవికి అసుర సంధ్యలో జన్మించిన వాడు నరకాసురుడు. ఈ రాక్షసుడు జనాలను పీడిస్తూ దేవలోకాన్ని సంక్షోభానికి గురిచేస్తూ లోక కంటకునిగా మారతాడు. కుమారుడైన అసురుడిని వధించే అవకాశం తనకే కల్పించాలని భూదేవి మహావిష్ణువును కోరుతుంది. ద్వాపరయుగంలో మహావిష్ణువు శ్రీకృష్ణభగవానునిగా, భూదేవి సత్యభామగా జన్మిస్తారు. నరకాసురుడి ఆకృత్యాలు అరికట్టడానికి, అధర్మకృత్యాలను అంతమొందించడానికి సత్యభామా సమేతంగా శ్రీకృష్ణుడు అసురుడితో భీకర పోరు సాగిస్తాడు. భూదేవి అంశ అయిన సత్యభామ శరాఘాతంతో నరకాసురుడు మరణిస్తాడు. లోకాన్ని పట్టి పీడించే నరకాసురుని బాధ తొలగినందుకు చతుర్దశి నాడు నరక చతుర్దశిగా అమావాస్యనాడు దీపావళిగా జరుపుకొంటారు.

వివిధ ప్రాంతాలలో దీపావళి నాడు మహాలక్ష్మీ పూజ చేస్తారు. లక్ష్మిని అర్చించినట్లయితే సకల శుభాలు కల్గుతాయని ప్రతీతి. పూర్వం దూర్వాస మహర్షి తనకు దేవేంద్రుడు ఇచ్చిన ఆతిథ్యానికి మెచ్చి ఒక మహిమాన్వితమైన హారాన్ని ప్రసాదిస్తాడు. ఇంద్రుడు తిరస్కార భావంతో ఆ హారాన్ని తన ఏనుగైన ఐరావతానికి వేయగా అది కాలితో తొక్కేస్తుంది. దీనికి ఆగ్రహించిన దూర్వాసుడు దేవేంద్రుని శపిస్తాడు. ఫలితంగా రాజ్యాన్ని, సర్వసంపదలను కోల్పోతాడు. దిక్కుతోచని ఇంద్రుడు శ్రీహరిని శరణు వేడగా జ్యోతి వెలిగించి దానిని మహాలక్ష్మీగా భావించి పూజించమంటాడు. ఫలితంగా తిరిగి రాజ్యాన్ని సంపదలన్నింటిని పొందుతాడు. సర్వసంపదలను సకల శుభాలను కల్గజేస్తుంది కాబట్టి ఉత్తరభారతంలో లక్ష్మీపూజ చేయడం ఆనవాయితీ.

దీపావళి నాడు సాయంత్రం పిల్లలంతా దిబ్బు దిబ్బు దీపావళి... మళ్లీ వచ్చే నాగుల చవితి అంటూ పాడుతూ పండుగ చేసుకొంటారు. టపాకాయలు కాల్చడం ఆనందాన్ని ఇవ్వడంతోపాటు వర్ష రుతువులో వాతావరణంలో తేమ వలన పుట్టుకొచ్చే క్రిమి కీటకాలు టపాసులు పేల్చడం వలన వచ్చే పొగ వలన నశిస్తాయన్న ఆరోగ్యసూత్రం ఇమిడి వుంది.



## ట్రంకు రోడ్డు

### గుండె పెద్దదే... కానీ బలహీనం



నెల్లూరులో అధికార పార్టీ నేతలు, జిల్లా ఉన్నతాధికార్లను తూర్పారపట్టాలంటే తెలుగుదేశం నేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి తరువాతనే ఎవరైనా. ఏ విషయాన్నైనా జనానికి అర్ధమయ్యేలా చెప్పే విద్య ఆయనకు మేనమామ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి నుంచి అబ్బిందని అందరూ చెబుతూ గుండె పెద్దదని వ్యాఖ్యానించేవారు. అటువంటి చంద్రమోహన్‌రెడ్డి ముఖ్యమంత్రిని కలవను హైదరాబాద్‌కు వెళ్లి అస్వస్థులయ్యారు. తక్షణం నిమ్స్‌లో చేర్చగా గుండెకు యాంజియోప్లాస్టీ చేయాల్సి వచ్చింది. బక్కపల్చగా అరవై కిలోలకు లోపు వుండే చంద్రమోహన్‌రెడ్డి మితాహారి. చేపల పులుసు బాగా తినే తమ నేత గుండె ఎందుకు బలహీనమయ్యిందన్న సందేహం తెలుగుదేశం కార్యకర్తలందరిలో కలుగుతోంది.

### వివేకా ప్రజాపథం



నిరంతరం వార్తల్లో వుండేందుకు ప్రయత్నించే నేతల్లో ఒకడైన ఆనం వివేకానందరెడ్డి ఈ మధ్య ప్రజలతో సాన్నిహిత్యం తగ్గించాడు. టీవీల్లోనే ఎక్కువగా కనపడుతున్నాడు. ఇలా అయితే లాభం లేదనుకొన్నాడో ఏమో ఆయన సృష్టి 'ప్రజాపథం'కు మళ్లీ తెరఎత్తాడు. ఈ పథంలో భాగంగా ప్రతి సోమవారం ఎమ్మార్వో ఆఫీసు, మంగళవారం ప్రభుత్వాసుపత్రుల తనిఖీ, బుధ, గురువారాల్లో ప్రభుత్వ పాఠశాలలు, కాలేజీల తనిఖీ, శుక్ర, శనివారాల్లో కార్పొరేషన్ కార్యాలయం, ఆదివారం హాస్టళ్ల తనిఖీ చేస్తానని ప్రకటించాడు. తనిఖీలతో ఠారెత్తిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి దెబ్బకు వివేకా కూడా పాతబాట పట్టాడని ట్రంకురోడ్డులో జనవాణి.

### ఉరుములు, మెరుపులు!



వర్షానికి ముందు ఉరుములు, మెరుపులు సహజం. గత వారం రోజులుగా నెల్లూరులో సమయం సందర్భం లేకుండా కురుస్తున్న భారీ వర్షానికి ముందు... మధ్యలో ఉరుములు, మెరుపులు జనాన్ని బెదరగొడుతున్నాయి. పెద్ద పెద్ద శబ్దాలకు తోడు సంభ్రమాశ్చర్యాలు కల్గించే మెరుపుల దెబ్బకు నగరంలో విద్యుత్, టెలికాం, ఇంటర్నెట్, కమ్యునికేషన్ల వ్యవస్థతోపాటు ఇళ్లలోని వినియోగవస్తువులు పనికి రాకుండా పోతుండడంతో ప్రతి ఒక్కరూ ఉరుములు, మెరుపుల గూర్చే మాట్లాడుకొంటున్నారు.

### కటింగ్‌కు వెయ్యి!



నెల్లూరులోని వివిధ ప్రభుత్వ శాఖల్లో పనిచేసే అధికారులు రెండు చేతులా సంపాదిస్తున్నారు. వివిధ రకాల పథకాల మంజూరు, భూసేకరణ, పరిహార నిర్ణయం వీటి తాలూకు చెక్కుల పంపిణీలోనే పెద్ద మొత్తాలు మామూళ్లుగా అందుతున్నాయి. ఈ డబ్బుతో ఇక్కడే అపార్ట్‌మెంట్‌లు, పొలాలు, నగా నట్రా కొంటూ బాగా తింటూ 'జల్సా'గా బతికేస్తున్నారు. నగరంలోని హేర్ కటింగ్ సెలూన్లలో రేట్లు అందుబాటులోనే వుంటాయి. ఒక జిల్లా అధికారి కటింగ్‌కు వెళ్లినప్పుడల్లా రెండు 500 రూపాయలు ఇస్తున్నట్లు నాయి బ్రాహ్మణ సోదరుడు గొప్పగా చెప్పడాన్ని బట్టి మన అధికారుల సంపాదన ఏ స్థాయిలో వుందో చాటి చెబుతోంది.



### జగన్‌కు మళ్లీ అస్వస్థత

ఎడతెరిపి లేకుండా ఓదార్పు యాత్ర చేస్తున్న వైఎస్.జగన్ ఆరోగ్యం బాగా వుండాలని చాలా చోట్ల ఆయన అభిమానులు ప్రార్ధనలు చేస్తున్నా ఆయనకు అస్వస్థత తప్పడం లేదు. నెల్లూరు జిల్లాలో రెండోవారంలోకి ప్రవేశించిన ఓదార్పు యాత్రకు బ్రేక్ పడింది. ఆయనకు మెడ నొప్పి వచ్చింది. పర్యటనల్లో వాహనం డోర్ వద్ద నిల్చొని అభివాదం చేయడం వల్ల మెడ, భుజం కండరాలపై ఒత్తిడి ఏర్పడింది. చెన్నై, హైదరాబాద్‌ల నుంచి వచ్చిన ప్రత్యేక వైద్యులు విశ్రాంతి తప్పనిసరి అని చెప్పడంతో ప్రకృతి రమణీయతను ఆస్వాదిస్తూ కండలేరు డ్యాం అతిథి గృహంలో విశ్రాంతి తీసుకోక తప్పలేదు. అస్వస్థతమూలంగా ఆయనను కుటుంబ సభ్యులు కలుసుకోగలిగారు. ప్రకాశం జిల్లా యాత్రలోనూ జగన్‌ను కంటి కలక తీవ్రంగా ఇబ్బంది పెట్టగా నెల్లూరులో మెడనొప్పి ఆయన్ను ఓ పట్టుపట్టింది. చిన్న చిన్న అస్వస్థతలను దూరం చేసుకోను జగన్‌ను యోగా చేయమని శ్రేయోభిలాషులు సలహా కూడా ఇచ్చారట.

# వారఫలాలు

*తేది 30-10-2010 నుండి 5-11-2010 వరకు తులలో రవి, బుధ, శుక్రులు; కన్యలో శని; మీన, కుంభాల్లో గురువు; వృశ్చికంలో కుజుడు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; కర్కాటక, సింహ, కన్య, తులల్లో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

ఆరోగ్యం చక్కగా ఉంటుంది. కొందరికి గుండెకు సంబంధించిన సమస్యలుండవచ్చు. దీర్ఘకాలిక రోగులు జాగ్రత్త. సోదరుల ప్రవర్తన ఇబ్బందికరంగా ఉండవచ్చు. పిల్లల చదువు విషయం తృప్తికరంగా ఉండదు. కుటుంబ సభ్యులలో ఒకరు మీతో విరోధం పాటించవచ్చు. ఆర్థిక విషయాలు చాలా తృప్తికరంగా ఉంటాయి. కొత్త పెట్టుబడులు మంచి ప్రయోజనాన్నిస్తాయి.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

తీవ్రమైన అనారోగ్య సమస్యలు లేకపోయినా గ్యాస్టిక్ సమస్యలు, నరాలకు సంబంధించిన సమస్యలుంటాయి. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. ఇంటిలో పూజాది కార్యక్రమాలు నిర్వహిస్తారు. పుణ్య క్షేత్రాటనం చేసే అవకాశముంది. ఆర్థికంగా చాలా చక్కని కాలం. స్పెక్యులేషన్ లాభిస్తుంది. కొనుగోలుదారుల నాడిని సరిగా తెలుసుకొని వ్యాపారులు మంచి లాభాలను ఆర్జిస్తారు.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

దీర్ఘరోగులకు ఊరట. ఆరోగ్య సమస్యలు తక్కువ. కుటుంబ సభ్యుల మధ్య సహకారం బాగుంటుంది. దాంపత్య సుఖం చక్కగా ఉంటుంది. పాత పెట్టుబడుల నుండి మంచి లాభాలుంటాయి. అప్పులు తీరుస్తారు. భాగస్వామి నుండి మంచి తోడ్పాటుంటుంది. వ్యాపార వృద్ధికి ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగులకు చాలా మంచి కాలం. దొంగచాటు శత్రువుల ఆటలు సాగవు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ఆరోగ్య విషయం సాధారణంగానే ఉంటుంది. బిపి.రోగులు జాగ్రత్తగా ఉండాలి. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. పరస్పరం అనురాగం పెంపొందుతుంది. కొత్త మిత్రుల చేరిక ఉంటుంది. ఆర్థిక విషయాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారులకు వృత్తిపరులకు ప్రోత్సాహకరమైన కాలం. విస్తరణకు అనుకూలమైన సమయం. విద్యార్థులు చాలా శ్రద్ధగా అధ్యయనం సాగిస్తారు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

గొంతు, ఊపిరితిత్తులు, కన్ను వీటికి సంబంధించిన చిన్న చిన్న అనారోగ్య బాధలు తప్ప వేరే తీవ్ర అనారోగ్యసమస్యలుండవు. కళత్ర సంబంధాలు చక్కగా ఉంటాయి. పిల్లల ఆకస్మిక అనారోగ్యం ఆవేదనకు గురి చేస్తుంది. విరోధులు అణగి ఉంటారు. పితృవర్గం మరియు సోదరుల నుండి సహాయ సహకారాలు అందుతాయి. నూతన ఆదాయమార్గాలు కనుచూపుమేరలో లేవు.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్త 1, 2 పా

శరీరంలో జీవశక్తి తగ్గుతుంది. ఆకస్మిక ప్రమాదాలు ఎదురవవచ్చు. కుటుంబ పెద్దలతో అవగాహనాలోపం గొడవలకు దారి తీస్తుంది. దైవం వైపు మనసు పోనివ్వడం మంచిది. ఆదాయంలో మిశ్రమ ఫలితాలుంటాయి. స్పెక్యులేషన్ జోలికి పోరాదు. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. పాత బాకీలు వసూలు కావడం కష్టం. గృహిణులు భర్తలతో వాదాలకు దిగకుండడం మంచిది.

## పంచాంగం

1తేది ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవం.

4తేది నరక చతుర్దశి.

5తేది దీపావళి అమావాస్య.

**శుభ ముహూర్తాలు లేవు.**

**అక్టోబర్ తిథులు**

**ఆశ్వయుజ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 30 | శని | సప్తమి | ఉ.6.59 | గం.ల.వ |
| | | అష్టమి | తె.5.18 | గం.ల.వ |
| 31 | ఆది | నవమి | రా.3.11 | గం.ల.వ |
| 1 | సోమ | దశమి | రా.12.41 | గం.ల.వ |
| 2 | మంగళ | ఏకాదశి | రా.9.54 | గం.ల.వ |
| 3 | బుధ | ద్వాదశి | రా.6.55 | గం.ల.వ |
| 4 | గురు | త్రయోదశి | సా.3.53 | గం.ల.వ |
| 5 | శుక్ర | చతుర్దశి | మ.1.00 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com



**తుల**
చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

ఆరోగ్య విషయంలో చాలా చక్కగా ఉంటుంది. ఊపిరితిత్తులకు సంబంధించి కొద్దిగా సమస్యలుండవచ్చు. ఖర్చులు అదుపులో ఉండి ఆదాయం బాగుంటుంది. పాత వస్తువులను అమ్మజూస్తారు. భాగస్వామి ద్వారా మేలు కలుగుతుంది. వ్యాపారవృద్ధికి ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగులకు ఎదురుచూసిన ఆదాయం ఉంటుంది. వృత్తిపరులకు దూర దృష్టిలోపం ఇబ్బందులను కలుగజేస్తుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ

కీళ్ళ నొప్పులు, వాత సంబంధిత రోగాలు బాధిస్తాయి. కుటుంబ సభ్యులతో సంప్రదింపులు ఫలిస్తాయి. ఆర్థిక విషయాలు తృప్తికరంగా ఉంటాయి. అరువు పుచ్చుకున్నవారు తిరిగి చెల్లిస్తారు. కోరిన చోట రుణాలందుతాయి. వ్యాపారులు భాగస్వాముల విషయంలో జాగ్రత్తగా ఉండాలి. వృత్తిపరులు చక్కని ఆదాయాన్ని చూస్తారు. ఉద్యోగులకు పదోన్నతి, లేనివారికి నూతన ఉద్యోగప్రాప్తి లభిస్తుంది.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వీరికి ఈ కాలం చాలా ఇబ్బందికరమైనది. నిద్రలేమి, జ్వరం, పాదాలకు గాయాలు బాధిస్తాయి. కుటుంబములో కూడా చిన్న చిన్న సమస్యలుంటాయి. కళత్ర సంబంధాలు చక్కగా ఉండవు. ఆర్థిక విషయాల్లో అడ్డంకులెక్కువ. ఎదురుచూసిన డబ్బు చేతికందదు. ఖర్చులధికము. వసూళ్ళు తక్కువ అవడం, ఋణదాతల ఒత్తిడి వ్యాపారులను బాధిస్తాయి. వృత్తిపరులకు అన్ని వైపుల పోటీలధికం.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఆరోగ్య సమస్యలు తీవ్రతరంగా ఉంటాయి. వివిధ రకాలైన అనారోగ్య బాధలుంటాయి. భార్యా, భర్తల నడుమ అభిప్రాయభేదాలు అధికం. బంధువులతో సమస్యలు తీవ్రమౌతాయి. ఆర్థిక విషయాలు కొంత మెరుగు. అప్పులు పుడతాయి. భాగస్వామి ప్రవర్తన ఇబ్బందికరంగా ఉంటుంది. పోటీలెక్కువ. వృత్తిపరులు విస్తరణ చేస్తారు. ఉద్యోగులకు రావలసినవి అందుతాయి.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా

జలుబు, దగ్గు తప్ప వేరే ఆరోగ్య బాధలుండవు. కుటుంబములో శాంతి, సంతోషాలు తాండవిస్తాయి. సోదరులనుండి విమర్శలనెదుర్కొంటారు. వ్యాపారులకు ధనాదాయం బాగున్నా, వృత్తిపరులు పోటీలతో అధిక శ్రమతో ఇబ్బందులకు గురౌతారు. ఉద్యోగులకు చాలాకాలంగా ఎదురుచూసిన డబ్బు అందుతుంది. ఉద్యోగినులకు కోరిన చోటికి మార్పులుంటాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

ఆకస్మికంగా పైత్య, బిపిల బాధలు ఎదురౌతాయి. దగ్గు, ఊపిరితిత్తులకు సంబంధించిన సమస్యలుండవచ్చు. బంధుమిత్రుల సమాగమం ఆనందాన్నిస్తుంది. కొత్త బాంధవ్యాలేర్పడవచ్చు. ఆర్థిక విషయాలలో నూతన ప్రయత్నాలు చేస్తారు. ఖర్చులధికంగా ఉంటాయి. వ్యాపారంలో భాగస్వామ్యపు గొడవలు తగ్గుతాయి. వృత్తిపరులు అధికంగా శ్రమించాలి. ఉద్యోగులకు మేలైన కాలం.

# వాస్తు లోపం చిన్నదే... పీడన భూతమవుతుంది!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

మారెంపూడి అరుణ — చిత్తూరు

* *గ్రామీణ మేస్త్రులు, పూజారులే మాకు దిక్కు.*

వాళ్లలో కూడా మేధావులున్నారు. ఎంపిక చేసుకోవడంలోనే వుంది. సమస్య నూట పదహార్లది కాదు. రేపు నిర్మాణాలు సరిదిద్దాలంటే లక్షల్లో ఖర్చు పెట్టాలి.

కె.పరమేశ్వరరావు — కర్నూలు

* *ఇంతకు క్రితం దర్గా వుండేది. ఇప్పుడు దానికవతల గణపతి ఆలయం కట్టారు. మా గృహం వాటికి ఉత్తరం వైపు వుంది.*

ఇంటి ఆవరణలోనే ఇవేవీ ఉండకూడదు. ఆలయమూ నిషిద్ధమే. ఎంత సంపాదించినా ఆర్థిక, ఆరోగ్య నష్టాలు, వివాదాలు కలుగుతాయి.

పిట్టల్ల సదాశివం — చీరాల

* *పరీక్షల్లో విజయం సాధించాలంటే ఏం చేయాలి?*

ఇష్టపడి, కష్టపడి చదవడమే మార్గం. ఇంట్లో మత్స్యయంత్రం. చేతికి వైఢూర్యం మంచి ఫలితాలనిస్తాయి.

నెర్రవాడ ఉమాదేవి — ఉదయగిరి

* *గృహ నిర్మాణంలో వడిదుడుకులు వస్తున్నాయి. వరుస అనారోగ్యాలు, ఆర్థిక సమస్యలు వస్తున్నాయి.*

వాస్తు దోషాలున్నాయేమో ఇప్పటికైనా సరి చూసుకోండి. 'సుదర్శన యంత్ర' ప్రతిష్ట వల్ల ఈ సమస్యలు చాలా వరకు పరిష్కరింపబడుతాయి.

టి.వి.రుక్మిణి — నెల్లూరు

* *అమ్మాయి వివాహం బాగా ఆలస్యమవుతోంది. మనశ్శాంతి లేదు.*

ఉత్తర, దక్షిణ, ఆగ్నేయ సమస్యలు స్త్రీలపై ప్రభావం చూపిస్తాయి. రాహుస్థితి శత్రుస్థాన సంచారం గనుక గోమేధుకం(ప్రశస్తు) కుడి బుధాంగుళీయానికి ధరింపజేయండి.

షేక్ షాజహాన్ — నెల్లూరు

* *అమావాస్య రోజు ప్రయాణాలు కూడదంటారు. ఉన్నదున్నట్లు చెప్పండి.*

శాస్త్రాలు రాసిన కాలంలో లైట్లు లేవు. అమావాస్య చీకటి దినం. ప్రయాణానికి ఇబ్బంది. పైగా దారి దొంగల భయం. అందువల్ల అలా చెప్పారు.

సుగుణ భట్టాచార్య — బెంగుళూరు

* *యంత్ర ప్రతిష్ట తర్వాత ఆయన ఆర్థికంగా మళ్లీ పుంజుకున్నారు.*

తాత్త్విక, ఆధ్యాత్మిక శక్తులు మీకు అనుకూలంగా వున్నాయి. యంత్రంలోని 'బీజాక్షరాల్ని' మీవారు ప్రగాఢంగా విశ్వసించారు. అంతా భగవానుడి కృప.

డి.సుభద్రాదేవి — గూడూరు

* *మేము ఇల్లు కట్టుకోవాలి. మార్గశిర మాసంలో చేయాలనుకుంటున్నాము.*

మార్గశిరం 'కష్టం' అంది శాస్త్రం. కార్తీకం వుంది కదా ముందు. కార్తీకం 'ధనలాభం' అంటారు వశిష్ఠుల వారు.

బి.వి.సాత్విక — నెల్లూరు

* *పెళ్లి సంబంధాల్లో జాతకాలపై నెపం వేస్తున్నారు.*

మీ సుదీర్ఘమైన ఉత్తరం నన్ను కదిలించి వేసింది. స్త్రీలు ధనదాహంతో సంబంధాల్ని చెడగొడతారని, జాతకాలపై నెపం వేస్తారని మీ ఉత్తరం వల్లే అర్థమయింది. రోహిణి, పునర్వసు రెండూ మనుష్య దేవగణాల జాతకం చక్కగా కుదురుతుంది.

పైడిపాల మీనాక్షి — ఒంగోలు

* *అబ్బాయిది కర్కాటకం, అమ్మాయిది సింహం. జాతకం కుదరదని దాటవేశారు.*

అబ్బాయి బ్రాహ్మణ జాతి వర్ణం, అమ్మాయిది క్షత్రియ వర్ణం. వరునిది అగ్రరాశి. జాతకం కుదరలేదన్నది సాకు మాత్రమే. డబ్బు దృష్టి వున్న సంబంధం తప్పిపోయినందుకు సంతోషించండి.

పి.అశ్వత్థనారాయణ — ధర్మవరం

* *నాది అశ్వనీ నక్షత్రం, ఆవిడది ఆశ్లేష. మాకే దిక్కు స్థలం కలసి వస్తుంది.*

అశ్విని, ఆశ్లేష బ్రాహ్మణ శక్తి నక్షత్రాలు. ఇంద్రస్థానం తూర్పు కలసి వస్తుంది.

# ఉపాధిహామీ పథకం అక్రమాలపై అంబుడ్స్‌మెన్ కొరడా!

**జిల్లాలో జరుగుతున్న ఉపాధిహామీ పనుల్లో జరిగిన అవినీతి అక్రమాలను నియంత్రించడం కోసం, ఈ నిధులు స్వాహా చేసిన వారిపై కఠిన చర్యలు తీసుకోను నియమించిన అంబుడ్స్‌మెన్ పని తీరు బాగుంది.**

కేంద్రప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా ప్రవేశపెట్టిన జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం అమలులో కోట్ల రూపాయల నిధులు స్వాహా జరుగుతున్నాయి. ఎన్ని కఠిన నిబంధనలు విధించినా కూడా అధికారులు ఏదో ఒక రూపంలో పథకానికి తూట్లు పొడుస్తూ అక్రమాలకు పాల్పడుతూనే వున్నారు. నెల్లూరు జిల్లాలో గత సంవత్సరం నుంచి నిర్వహిస్తున్న సామాజిక తనిఖీల్లో నిధులు స్వాహా జరుగుతున్న విషయం బహిర్గతమయ్యింది.

ఈ పథకంలో విధులు నిర్వహిస్తున్న సాంకేతిక సిబ్బంది, ఫీల్డు అసిస్టెంట్లు స్థానికంగా ఏదో ఒక రాజకీయ పార్టీతో సంబంధాలు కలిగి వుంటున్నారు. వీరు చేస్తున్న అక్రమాలు బయటపడిన క్రమంలో తదుపరి చర్యలు తీసుకోకుండా జిల్లా వున్నతాధికార్లపై ఒత్తిళ్లు తెస్తుంటారు. దీంతో చర్యలు తీసుకొనేందుకు అధికార యంత్రాంగం వెనుకంజ వేస్తుంది. గ్రామీణ ప్రాంతాలలో వలసలు నివారించి ఏడాదికి వంద రోజులు పని కల్పించాలన్న సంకల్పంతో కేంద్రప్రభుత్వం ఈ పథకం అమలుకు శ్రీకారం చుట్టింది.

అధికార పార్టీకి చెందిన నేతలకు ఈ పథకం కల్పతరువుగా మారింది. అధికార్లు, సిబ్బంది రాజకీయ ఒత్తిళ్లకు తలొగ్గి అక్రమాలకు పాల్పడుతున్న సంఘటనలపై రాష్ట్రప్రభుత్వానికి అనేక ఫిర్యాదులు వెళ్లాయి. ఎలాగైనా ఈ పథకంలో అక్రమాలను నియంత్రించడంతోపాటు నిధులు స్వాహా చేసిన వారిపై కఠిన చర్యలు తీసుకోవాలని ప్రభుత్వం నిర్ణయించింది. దీంతో అక్రమాలపై విచారణ జరిపి చర్యలు తీసుకొనేందుకు ప్రత్యేకంగా "అంబుడ్స్‌మెన్" అనే అధికారిని జిల్లాకు నియమించడం జరిగింది. ఈ అంబుడ్స్‌మెన్‌కు పూర్తి అధికారాలను అప్పగించింది.

జిల్లాలోని పలు మండలాల నుంచి అంబుడ్స్‌మెన్‌కు అనేక ఫిర్యాదులు అందాయి. ఫిర్యాదు చేస్తున్న వారు పూర్తి సమాచారం పొందుపరచలేకపోవడంతో విచారణ జరపడం కష్టంగా మారింది. గత నెల రోజులు నుంచి పూర్తి వివరాలతో కూడిన ఫిర్యాదులు ఆరు వరకు అందాయి. రాపూరు, సీతారాంపురం, పొదలకూరు, వరికుంటపాడు, ఉదయగిరి, మర్రిపాడు మండలాల నుంచి ఫిర్యాదులు వచ్చాయి. తొలుత రాపూరు మండలంలోని ఏపూరు గ్రామంలో జరిగిన పనులపై ఉపాధిహామీ పథకం అంబుడ్స్‌మెన్‌గా నియమితులైన ప్రభాకర్‌రావు విచారణ జరిపారు.

ఈ విచారణలో సిబ్బంది అక్రమాలకు పాల్పడినట్లు నిర్ధారించారు. ఒక రైతుకు మంజూరైన నిమ్మచెట్లను మరో సర్వే నెంబర్‌లోని పొలంలో నాటడం జరిగింది. ఈ విషయం సిబ్బంది ప్రమేయంతోనే జరిగిందని గుర్తించారు. మండల పరిషత్ అభివృద్ధి అధికారి పర్యవేక్షణ చేయకుండానే సంబంధిత ఫైల్‌పై సంతకం చేశారు. దీంతో నిమ్మచెట్ల కోసం మంజూరు చేసిన 7వేల 2వందల రూపాయలను రికవరీ చేయాలని, అలాగే ఎమ్పీడిఓ వాణిపై శాఖాపరంగా చర్యలు తీసుకోవాలని అంబుడ్స్‌మెన్ సిఫార్సు చేయడం జరిగింది.

సీతారాంపురం మండలం ఉపాధిహామీ పథకంలో దాదాపు 2కోట్ల రూపాయలవరకు స్వాహా జరిగినట్లు ఫిర్యాదులు అందాయి. అంబుడ్స్‌మెన్‌కు అందిన ఐదు ఫిర్యాదుల్లో ఒకటి నిర్ధారణ జరగ్గా మిగిలిన వాటిపై త్వరలో విచారణ చేపట్టనున్నారు. ప్రజల నుంచి ఫిర్యాదులు స్వీకరించిన వెంటనే సంబంధిత అంబుడ్స్‌మెన్ నుంచి నోటీసులు అందుకున్న అధికారులు అక్రమాలు బయటపడితే ఎటువంటి చర్యలు తీసుకుంటారోనని భయాందోళన చెందుతున్నారు.

ప్రభుత్వం నియమించిన అంబుడ్స్‌మెన్ రాపూరు మండలంలోని అధికార్లు, సిబ్బందిపై చర్యలు తీసుకోవాలని సిఫార్సు చేశారు. జిల్లా అధికార్లతోపాటు రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి నివేదిక పంపుతారు. అన్ని జిల్లాల అంబుడ్స్‌మెన్‌ల నుంచి వచ్చిన నివేదిక ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి కేంద్ర గ్రామీణాభివృద్ధి మంత్రిత్వశాఖకు పంపుతారు. ఇప్పటి వరకు రాజకీయ నేతల అండదండలతో అక్రమాలను కప్పిపుచ్చుకొంటున్న అధికార్లు, సిబ్బంది అంబుడ్స్‌మెన్ విచారణతో తలలు పట్టుకొంటున్నారు.



# కార్పొరేషన్‌లో భవనాల క్రమబద్ధీకరణ డిడిలు హాంఫట్!

**నెల్లూరు పౌరులు తమ భవనాల క్రమబద్ధీకరణ కోసం సిటీ ప్లానింగ్ విభాగానికి దరఖాస్తులతోపాటు అందజేసిన 40లక్షల రూపాయల డిడిలను సిబ్బంది తెలివిగా మాయం చేసినా పట్టించుకొనే అధికారే లేకుండా పోయారు.**




**అక్రమ బాటన నెల్లూరు కార్పొరేషన్.**

అధికారుల వుదాసీన వైఖరి, సిబ్బంది నిర్లక్ష్యం కారణంగా మునిసిపల్ కార్పొరేషన్ ఖజానాలో జమ కావాల్సిన డిమాండ్ డ్రాఫ్టులు మాయమవుతున్నాయి. దీనికి కేంద్ర బిందువుగా సిటీ ప్లానింగ్ విభాగాన్ని పేర్కొనవచ్చు. మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో అనుమతి లేకుండా భవన నిర్మాణం చేపట్టిన వారు తిరిగి క్రమబద్ధీకరణ చేయించుకొనేందుకు ప్రభుత్వం వీలు కల్పించింది. ఇందులో భాగంగా క్రమబద్ధీకరణ చేయించుకొనే వారు భవన నిర్మాణానికి సంబంధించిన పూర్తి వివరాలను తెలియజేయడంతోపాటు చెల్లించాల్సిన ఫీజును డి.డి. రూపంలో అందజేయాల్సి వుంటుంది.

గతంలో సిటీ ప్లానింగ్ విభాగం అనుమతి లేకుండానే భవనాలు నిర్మించుకున్న వారు క్రమబద్ధీకరణ కోసం దరఖాస్తు చేసుకొంటున్నారు. దరఖాస్తుతోపాటు డి.డి.ని జతచేసి సిటీప్లానింగ్ విభాగంలో అందజేస్తున్నప్పటికి సిబ్బంది నిర్లక్ష్యం కారణంగా డి.డిలు మాయమైపోతున్నాయి. ఈ డి.డిలు మాయమైన విషయం బయటకు రాకుండా ఎన్ని జాగ్రత్తలు తీసుకొంటున్నప్పటికీ ఇతర విభాగాల్లో పని చేస్తున్న సిబ్బంది ద్వారా బయటకు పొక్కింది. డి.డిలు మాయమైన సంఘటనపై కమిషనర్ సిబ్బందిని పిలిచి హెచ్చరికలు చేసినా వారిలో ఎటువంటి మార్పు కానరావడం లేదు.

క్రమబద్ధీకరణ కోసం డి.డిలు అందజేసిన భవన యాజమానులకు ఎటువంటి నష్టం వుండదు కాని మునిసిపల్ కార్పొరేషన్ డి.డిలు మాయమైన కారణంగా దరిదాపులు 40 లక్షలకు పైగా ఆదాయాన్ని కోల్పోయింది. కార్పొరేషన్ పాలకవర్గం వున్నప్పటి నుంచి డి.డిలు అదృశ్యమవుతున్నాయి. సిటీ ప్లానింగ్ విభాగానికి వచ్చిన డి.డిల గురించి ఆరు నెలల వరకు ఎవరు పట్టించుకోవడం లేదు. ఈ ఆరునెలల వ్యవధిలో కొన్ని భవనాలు క్రమబద్ధీకరణ జరిగిపోతున్నాయి. డి.డిలు మాయమవడంపై సిబ్బంది ఒకరిపై మరొకరు చెప్పుకొంటున్నారు. ఇంతవరకు బాధ్యులైన వారిపై ఎటువంటి చర్యలు తీసుకోలేకపోయారు. కార్పొరేషన్ పాలకవర్గం గడువు ముగియడంతో ప్రత్యేక అధికారిని ప్రభుత్వం నియమించింది.

ప్రత్యేకాధికారిగా నియమితులైన అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య పరిపాలనా పరంగా పూర్తిస్థాయిలో దృష్టి కేంద్రీకరించలేకపోతున్నారు. ఈయనకు వివిధ సంక్షేమశాఖలు అమలు చేస్తున్న అభివృద్ధి పథకాల పర్యవేక్షణ చూసే బాధ్యతను కూడా ప్రభుత్వం అప్పగించింది. ఈ క్రమంలో కార్పొరేషన్ పనితీరుపై సరైన విధంగా స్పందించలేకపోతున్నారు. అలాగే సిబ్బంది పట్ల కఠినంగా వ్యవహరించే మనస్తత్వం లేని వ్యక్తి కావడం వలన క్రిందిస్థాయి సిబ్బంది పారదర్శకంగా విధులు నిర్వహించడం లేదు. గతంలో కంటే ఇప్పుడు పారిశుద్ధ్యం మరింత అధ్వాన్నంగా తయారయ్యింది.

సిటీ ప్లానింగ్ విభాగానికి సంబంధించిన డి.డిలు అదృశ్యం అయిన విషయాన్ని ప్రత్యేక అధికారి దృష్టికి తీసుకవెళ్లలేదంటే కార్పొరేషన్ కమిషనర్ ఎలా పరిపాలన చేస్తున్నారో అర్థం చేసుకోవచ్చు. గత సంవత్సరం నుంచి తరచూ డి.డిలు అదృశ్యం అవుతున్నా అధికారుల్లో కదలిక లేదు. డిడిలు ఎక్కడ, ఎందుకు, ఎవరి నిర్లక్ష్యం కారణంగా కనిపించకుండా పోయాయన్న దానిపై ప్రాథమిక విచారణ జరగలేదు. ఇప్పటికైనా అధికారులు స్పందించి సక్రమ విచారణ జరిపితే ఎన్ని డి.డిలు అదృశ్యం కాబడ్డాయో వివరాలైనా తెలుస్తాయి.

# వివాదాస్పద 'రక్తచరిత్ర'!



✍ అల్లూరు రహీం

పుష్కరం విరామం తర్వాత దర్శకుడు రామ్‌గోపాల్ వర్మ తెలుగులో డైరక్టర్‌గా తీసిన రక్తచరిత్ర చిత్రం అత్యంత వివాదాస్పదమయ్యింది. రక్తచరిత్ర సినిమాకు ఆయన ఎంచుకొన్న కథే రక్తసిక్తమైనది. మూడు దశాబ్దాల క్రితం అనంతపురం జిల్లా మద్దెలచెరువు గ్రామానికి చెందిన నారాయణరెడ్డి, ధర్మవరానికి చెందిన కనుముక్కల చెన్నారెడ్డిలు ఈ ప్రాంతంలో పెద్ద భూస్వామ్య కుటుంబీకులుగా పేరుగాంచారు. ఆ తర్వాత వీరు శాసనసభ్యులుగా కూడా ఎన్నికయ్యారు. ఫ్యాక్షన్ నేతలుగా మారిన వీరికి ప్రత్యర్థులను చంపడం, చంపించడం మంచినీళ్ల ప్రాయం. వీరి దురాగతాలను ఓ సాధారణ రైతు పరిటాల శ్రీరాములయ్య కమ్యూనిస్టులు, నక్సలైట్ల సహకారంతో ఎదుర్కొన్నాడు. ఆయన్ను నారాయణరెడ్డి ఓ కేసు వ్యవహారమై అనంతపూర్ పోయి వస్తుండగా మార్గ మధ్యంలో బస్సునాపి చంపించాడని అభియోగం. దీన్ని తట్టుకోలేక శ్రీరాములయ్య పెద్ద కుమారుడు హరి తిరగబడగా అతన్ని అప్పటి అధికార పార్టీ సహకారంతో ఎన్‌కౌంటర్ చేయించారు. కనుముక్కల చెన్నారెడ్డి ఇద్దరు కుమారుల్లో ఒకడైన ఓబులరెడ్డి ఓ అరాచక శక్తి. ధర్మవరంలో తన కంటికి ఆనిన ప్రతి ఆడపిల్లను అనుభవించేవాడని ప్రతీతి. ఎవరైనా ఎదురు తిరిగితే కొట్టి చంపేవాడు. కరువు నేలలో నెత్తుటేళ్లు పారించిన ఫ్యాక్షన్ నేతలకు ఎదురొడ్డిన వ్యక్తి పరిటాల రవి. శ్రీరాములయ్య రెండో కుమారుడితను. ఈయన్ను తెలుగుదేశం సర్వాధినేత స్వర్గీయ ఎన్టీరామారావు తురుపు ముక్కగా వాడాడు. ఎమ్మెల్యే ఆ తర్వాత రాష్ట్ర మంత్రిని చేశాడు. సీమలోని తమ వ్యతిరేక ఫ్యాక్షన్ నేతలను అంతమొందించడంతో పంచాయితీల్లో కోట్లకు పడగెత్తి చివరకు ప్రత్యర్థుల చేతులలో రవి 2005 సంవత్సరంలో పరమ కిరాకతంగా అంతమయ్యాడన్నది చరిత్ర.




ఈ చరిత్రను కల్పిత గాథ అంటూ సినిమాగా తీసిన రామ్‌గోపాల్‌వర్మ పలు తప్పిదాలు చేశాడు. వాటిలో ముఖ్యమైనది తెలుగు జాతి కీర్తిప్రతిష్టలు పెంచిన స్వర్గీయ ఎన్టీ రామారావును పిరికిపందగా, ఫ్యాక్షనిస్టులకు ప్రోత్సాహమిచ్చిన వ్యక్తిగా చూపించడం. ఎన్టీఆర్‌ను తీవ్రంగా విభేదించేవారు కూడా సాహసం చేయని విమర్శ ఇది. పనికిమాలిన పీలగొంతుతో సినిమా మొత్తం వర్మ చెప్పిన బ్యాక్‌గ్రౌండ్ డైలాగుల్లోనూ ఎన్టీఆర్‌ను విమర్శించడం సబబుగా లేదు. ఓ రకంగా చెబితే రక్తచరిత్ర-1లో డీసెంట్ విలన్ ఎన్టీఆరే. దీన్ని భరించలేక ఆ పార్టీ శ్రేణులు రాష్ట్రవ్యాప్తంగా ఆందోళన బాటపట్టాయి. సినిమాలో ఓబులరెడ్డి పాత్రకు బుక్కారెడ్డి అని పేరుపెట్టి ఆ పాత్రను పరమక్రూరంగా మలచిన తీరు భీభత్సంగా వుంది. కానీ ఇటువంటి సినిమాలను అద్భుత టేకింగ్‌తో తీసే రామ్‌గోపాల్‌వర్మ నారాయణరెడ్డి పాత్రధారుడైన తమిళ నటుడు, చెన్నారెడ్డి పాత్రధారుడైన కోట శ్రీనివాసరావుల దగ్గర నుంచి అద్భుత నటన రాబట్టాడు. శ్రీరాములయ్య, మహిళా ఇన్స్‌పెక్టర్ పాత్రధారిణి అయిన హిందీ నటుల నటనను చూసి మన తెలుగు నటులు ఎంతో కొంత నేర్చుకోవాలి. తరతరాల రక్తచరిత్ర చరణంతోసాగే బ్యాక్‌డ్రాప్ పాటతోపాటు డబ్బున్నోడా పాటలను కలువ సాయి అర్థవంతంగా వ్రాశాడు. నాగేశ్వరరావు వ్రాసిన మాటల్లో ఈ సమాజం ఎవడబ్బ సొమ్ము కాదు. గన్ పవర్ కంటే పొలిటికల్ పవర్ గొప్పది. నాయకుడి ముఖం క్లీన్‌గా వుండాలి. లోకకళ్యాణం కోసం రాముడే ఎందరినో చంపాడు ఆలోచింపజేస్తాయి. కరవు జిల్లా స్వరూప స్వభావాలను అద్భుతంగా చూపడంలో కెమెరామెన్ అమోల్ రాథోడ్, వెరైటీగా పోరాటాలు చూపడంలో జావేద్-ఏజాద్, బ్యాక్‌గ్రౌండ్ సంగీతంతో ధరమ్-సందీప్ తమ సత్తా చాటారు. వీరందరి కృషి ఫలితం గానే 16 రీళ్ల ఈ మొదటి భాగం రక్తచరిత్రను ప్రేక్షకులు చూడగలుగుతారు. మొదటిభాగంలో మద్దెలచెరువు సూరి, భానుమతి, మొద్దు శీను పాత్రలు రాలేదు. వీటిని చూడను నవంబర్ 19వ తేది వరకు రెండవ భాగం కోసం వేచి చూడాల్సిందే. పరిటాల రవి పాత్రను పోలిన ప్రతాప్ రవి పాత్రను రక్తచరిత్రలో వివేక్ ఓబరాయ్ బాగానే పోషించాడు. సునీతను పోలిన నందిని పాత్రను రాధికాఆప్టే చక్కగా పోషించింది. ఎన్టీరామారావు పాత్రను పోలిన శివాజీరావు పాత్రలో శతృఘ్నసిన్హా అంతగా కృతకృత్యుడు కాలేదు. ఎంత కల్పితగాథ అని చెప్పినా ఈ యదార్థ కథను ముందే చర్చించుకొన్నాం కాబట్టి మళ్లీ వివరించడం లేదు. ప్రతీకారమే పరమ సోపానం అన్న భారత సూక్తి; ప్రతీకారమే లోకవినాశనం అన్న జాతిపిత గాంధీజి సూక్తులు వర్మ లాంటి దర్శకుల సినిమా వాల్‌పోస్టర్ల ప్రచారానికి ఉపయోగపడడం బాధగా వుంది. J

## డబ్బు కోసం దిగజారను!



తక్కువ కాలంలోనే బాలీవుడ్‌లో హీరోయిన్‌గా నిలదొక్కుకొన్న ముద్దుగుమ్మ దీపికా పదుకొనే. ప్రస్తుతం నాలుగు చిత్రాలు ఆమె చేతిలో వున్నాయి. డబ్బుకోసం మంచి పాత్రలు లేని సినిమాలు, పనికిమాలిన వుత్పత్తులకు ప్రచారం చేయనంటుందామె. ఈ విషయాలను వివరిస్తూ పాత్రల ఎంపికలో నాకంటూ ఓ ప్రత్యేకమైన ఫార్ములా ఏదీ లేదు. నాలోని నటిని తెరపై కనబడేలా చేసే పాత్రల్లో నటించడానికి ప్రాధాన్యత ఇస్తాను. మరీ ముందుచూపు మంచిది కాదు. డబ్బుల కోసం కక్కుర్తి పాత్రల్లో కనపడను. ఆరోగ్యవంతమైన జీవన విధానం, పౌష్టిక ఆహారం అందం ఎక్కువ కాలం నిలిచి వుండేలా చేస్తాయి. సహజమైన ఉత్పత్తులు వాడితేనే మంచిది. ఎవరో చెప్పారని ఏవేవో వాడొద్దు. చర్మంపై ప్రయోగాలు చేస్తే ఎప్పటికీ మన అందం తిరిగి రాదు. నేను చాలా ఉత్పత్తులకు ప్రచారం చేస్తుంటాను. అవన్నీ నాణ్యంగా వుంటేనే నటించడానికి అంగీకరిస్తానంది.

## రామ్‌చరణ్ అత్తగా శ్రీదేవి?



అందాల తార శ్రీదేవి తెలుగు సినిమాల్లో మళ్లీ కనిపించనుంది. అదీ మెగాస్టార్ తనయుడు రామ్‌చరణ్‌కు అత్తపాత్రలో శ్రీదేవి నటించే అవకాశాలున్నాయంటూ టాలీవుడ్‌లో విపరీత ప్రచారం జరుగుతుంది. చిరంజీవి నటించిన సూపర్‌హిట్ మూవీ అత్తకు యముడు అమ్మాయికి మొగుడు చిత్రం ఆధారంగా రామ్‌చరణ్ హీరోగా ఒక చిత్రం రూపొందే అవకాశం వుందని, దానిలో అత్తగా శ్రీదేవిని అడిగినట్లు చెబుతున్నారు. ఇదే సినిమాలో శ్రీదేవి కుమార్తె జాహ్నవి, రామ్‌చరణ్ సరసన నటించే అవకాశం వుందంటున్నారు. రామ్‌చరణ్‌తో సినిమా చేయాలని ఉత్సాహపడుతున్న చాలా మంది దర్శకులు చిరంజీవి సూపర్‌హిట్ సినిమాల ఫార్ములాలతో కథలు వ్రాసుకొని వినిపిస్తున్నారట. పరిశ్రమలో కొన్ని సార్లు రూమర్లే నిజమవుతాయి. శ్రీదేవి నటించే విషయమై ఇప్పుడే ఏ విషయం చెప్పలేం!

## శంకర్‌ను పొగిడిన ఐశ్వర్య



ఇటీవల విడుదలైన రోబో సినిమాకు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు వచ్చింది. కలెక్షన్లు అదిరిపోయాయి. చాలా రోజుల తర్వాత తాను నటించిన చిత్రం విజయం సాధించడంతో ఐశ్వర్యరాయ్ ఆనందంగా వుంది. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ రోబో చిత్రం ద్వారా ఇండియన్ సినిమాను ఎంతో ఎత్తుకు తీసుకెళ్లిన ఘనత శంకర్‌ది. ఆయన జీన్స్ సినిమాలో ఇండియన్ స్క్రీన్‌పై కొత్త టెక్నాలజీని పరిచయం చేశాడు. దేశం గర్వించ తగ్గ దర్శకులని ఐదుగురి పేర్లు తీస్తే అందులో శంకర్ ఖచ్చితంగా వుంటాడు. దక్షిణాదిలో నాకు స్టార్ హీరోయిన్ హోదా శంకర్ సినిమాల్లో నటించడం ద్వారానే వచ్చింది. శంకర్ కోసమే రోబోలో నటించానంది ఈ సుందరి.

## నటిస్తానండీ...



అభినయం మీద నటీమణులకు ఈ మధ్య మరీ ప్రేమ ఎక్కువైపోతోంది. ఎంతసేపు అందాల ఆరబోతేనా? కుసింత నటించే అవకాశం ఇవ్వమంటున్నారు. విచిత్రమేమిటంటే శృంగారం రంగరించే పాత్రల్లో బహు తేలికగా దూరిపోయి, మనసుల్ని గిలిగింతలు పెట్టించేసి, గుడులు సైతం కట్టించుకొన్న హీరోయిన్ నమిత నటించాలని వుందంటుంది. వాణిజ్యపరమైన చిత్రాలు చాలా చేశాను. దర్శకులందరూ నన్ను అందంగా చూపించారు. కానీ నాకిప్పుడు నటించాలని వుంది. నాలోని అభినయాన్ని ప్రదర్శించే అవకాశం కోసం ఎదురు చూస్తున్నాను. త్వరలో అటువంటి పాత్ర దొరుకుతుందని ఆశిస్తున్నానంది.

## సమస్యల లోగిలి బియిడి కాలేజి

భావి భారత పౌరులను తీర్చిదిద్దే గౌరవప్రదమైన వృత్తి ఉపాధ్యాయ వృత్తి. అలాంటి ఉపాధ్యాయులను తయారు చేసే నెల్లూరు ప్రభుత్వ బియిడి కళాశాలలో నేడు అడుగడుగునా అవకతవకలు, అక్రమాలు చోటుచేసుకోవడంతో పాటు మహిళా విద్యార్థినులపై లైంగిక వేధింపులు, జుగుప్స కలిగించేలా గురువుల తీరు ఇది నేటి కళాశాల పరిస్థితి. భవిష్యత్ ఉపాధ్యాయులకు బోధించే ఉపాధ్యాయుడే కీచకుడుగా మారడంతో ఇటీవల కళాశాల పరువు పెన్నపాలైంది. కళాశాల స్థితిగతులపై దృష్టి సారించినట్లైతే అనేక విషయాలు వెలుగు చూస్తున్నాయి. కళాశాలకు రెగ్యులర్ ప్రిన్సిపాల్ లేకపోవడమే పలు సమస్యలకు కారణంగా తెలుస్తోంది. గుంటూరు డిఇఓగా పనిచేస్తున్న పార్వతి ఇక్కడ ఇన్‌ఛార్జి బాధ్యతలు నిర్వర్తిస్తుంది. ఆమె కళాశాల మొహం చూసి రెండేళ్లయ్యింది. దీంతో సిబ్బంది ఆడింది ఆట అయ్యింది. విద్యార్థుల వద్ద నుంచి ప్రభుత్వం నిర్దేశించిన వాటికంటే అధికంగా ఫీజులు వసూలు చేయడంతోపాటు విద్యార్థినులపై అసభ్య ప్రవర్తన అధికమయ్యింది. దీనికి తోడు అధ్యాపకుల సమస్య. పలు ప్రధాన సబ్జెక్టులను బోధించే అధ్యాపకులు లేకపోవడంతో విద్యార్థులు ఇబ్బందులు పడుతున్నారు. వీటన్నింటిని సర్దుబాటు చేయాల్సిన ప్రిన్సిపాల్ కళాశాల మొహం చూడకుండా సైకాలజీ లెక్చరర్ నరసింహారెడ్డి లైంగిక వైధింపుల గొడవ జరగడంతో హడావిడిగా అర్థరాత్రి కాలేజికి వచ్చి రికార్డులను తారుమారు చేసేందుకు, ఫిర్యాదుచేసిన విద్యార్థులను భయపెట్టేందుకు ప్రయత్నించిందనే ఆరోపణలు రావడంతో గగ్గోలు రేగింది.



*వివాదాల ఊబిలో బియిడి కాలేజి.*

# చేయి తిరిగిన వడ్రంగి!

గృహాలకు శోభను చేకూర్చి పెట్టేవి తలుపులు, కిటికీలు. ఎంతో అందంగా, మరెంతో ఆకర్షణీయంగా వుండేలా ప్రధాన ద్వారాల్ని ఏర్పాటు చేసుకోవడం ఇటీవల కాలంలో అధికమయ్యింది. ఎవరికి వారు తమ ఇష్టాఇష్టాలకు అనుగుణంగా తలుపులను తయారు చేయించుకొంటున్నారు. ఈ తరహా తయారీని ఉడ్ కార్వింగ్ వర్క్ అంటారు. ఇందులో తనదైనశైలిలో కళాత్మకంగా తలుపులపై డిజైన్‌చేస్తూ పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొంటున్నాడు నెల్లూరు నిప్పో ఫ్యాక్టరీ ఎదురుగా వుండే పుట్టవీధికి చెందిన పెద్దపాళెం శంకర్. శ్రీకాళహస్తి మండలం గుండురాళ్లపల్లి గ్రామానికి చెందిన శంకర్ తాతముత్తాతల నుంచి కొయ్యపని వృత్తిగా చేసుకొని జీవనం సాగించారు. అదేబాటలో శంకర్ ఈ వృత్తినే నమ్ముకొని కుటుంబాన్ని పోషించుకొంటున్నాడు. చేసే పనిలో నైపుణ్యతకు తోడు కళాత్మకంగా వుండాలన్న ఉద్దేశ్యంతో ఉడ్ కార్వింగ్‌లో శిక్షణ పొందాడు. గృహ యజమానుల అభిరుచులకు తగినట్లు తలుపులపై వివిధ చిత్రాలను చెక్కుతూ తనదైన ముద్ర వేస్తున్నాడు. సోదరుడైన భాస్కర్ సహకారం ఎంతో వుందని చెప్తున్న శంకర్ ఒక్కో తలుపుపై డిజైన్ చెక్కేందుకు 15 రోజుల నుంచి 20 రోజుల సమయం పడుతుందంటున్నాడు. వినాయకుడు, వెంకటేశ్వరస్వామి, లక్ష్మీదేవి, ఏనుగు బొమ్మలతోపాటు పూజగదిని ప్రత్యేకంగా తయారు చేయడం. వీటితోపాటు అష్టలక్ష్మి, దశావతారాలు, రాధాకృష్ణుల బొమ్మలు కళాత్మకత ఉట్టిపడేలా రూపొందించడంలో వీరి ప్రతిభ అద్వితీయం.


*ఇళ్ల తలుపుపై అద్భుత కళాఖండాన్ని చెక్కుతున్న పెద్దపాళెం శంకర్.*

## చరిత్రను కాపాడుకోవాలి

చరిత్ర మానవ జీవితంలో అంతర్భాగం. చరిత్ర లేనిదే మానవ జీవితం లేదు. ఎన్నిటికో ఆధారమైన చరిత్రను ప్రతిఒక్కరూ కాపాడుకోవాలని మాజీ మంత్రి, సాహిత్యాభిమాని, మండలి బుద్ధ ప్రసాద్ సూచించారు. రచయిత ఈతకోట సుబ్బారావు వ్రాసిన 'అలనాటి నెల్లూరు' పుస్తకావిష్కరణ కార్యక్రమం 24వ తేది ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాల్‌లో జరిగింది. ప్రధాన వక్తగా విచ్చేసిన బుద్ధ ప్రసాద్ పుస్తకాన్ని ఆవిష్కరించి తొలి ప్రతిని న్యాయవాది వేములపాటి అనంతరామయ్యకు అందించారు. చరిత్రను నిర్లక్ష్యం చేసినందువల్లే ఇతర రాష్ట్రాల ముందు మనం తలవంచుకోవాల్సి వస్తోందని, తెలుగు భాషను కాపాడుకోవాల్సిన పరిస్థితి ఏర్పడిందని ఆవేదన చెందారు. 'అలనాటి నెల్లూరు' పేరుతో పుస్తకాన్ని వ్రాసిన సుబ్బారావును అభినందించారు. వార్తాపత్రికలు మాండలిక భాషను మరవకూడదని నెల్లూరు నుంచి వెలువడే 'జమీన్‌రైతు' ఇన్నాళ్లు నడుస్తుందంటే దానిలో వచ్చే ప్రత్యేక తరహా వార్తలే కారణమన్నారు. ఈ కార్యక్రమంలో ప్రముఖ విమర్శకులు, సాహితీవేత్త, పూర్ణచంద్, జలదంకి ప్రభాకర్, గుడిపాటి, చంద్రలత, డాక్టర్ శ్రీనివాసతేజ తదితరులు పాల్గొన్నారు.


*అలనాటి నెల్లూరు పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న మాజీ మంత్రి మండలి బుద్ధప్రసాద్.*

## సిబ్బంది సొంత డబ్బా!

**డిఇఓ ఆఫీసులో పరిస్థితిది.**

ఎవరైనా వ్యక్తి లేదా సంస్థ చేసే కృషిని, పనిని ఎదుటి వ్యక్తులు గుర్తించి అభినందించడం సహజం. కానీ విద్యాశాఖలో మాత్రం సిబ్బంది తమకు తాము చక్కగా పనిచేస్తున్నామని, తాము నిజాయితీ పరులమని చెప్పుకోవడం చూస్తుంటే తమ తప్పును కప్పిపుచ్చుకొనేందుకు అవినీతి, అక్రమాలు ప్రజలకు తెలియకుండా ఉండేందుకు చేస్తున్నట్లుగా వుంది. ఇటీవల కొంత కాలంగా డిఇఓ కార్యాలయంలో అవినీతి పెచ్చుమీరిందని, త్వరితగతిన పూర్తయ్యే పనులను సిబ్బంది కావాలని నానుస్తూ ఉపాధ్యాయులను కార్యాలయం చుట్టూ తిప్పుకొంటున్నారని ఉపాధ్యాయ సంఘమైన యుటిఎఫ్ తీవ్ర ఆరోపణలు చేసింది. దీనికి సంబంధించి తమ నిజాయితీని నిరూపించుకోవాల్సిన సిబ్బంది కొందరు తమకు తామే దొరలమని, ఉత్తమోత్తములమని, మేలిమి ముత్యాలమని, నీతివంతులమని చెప్పుకోవడం హాస్యాస్పదమైంది. జిల్లా విద్యాశాఖ కార్యాలయంలో అవినీతి గురించి, అక్కడి సిబ్బంది లంచావతారం గురించి కార్యాలయంలోని గోడలు, టేబుళ్లు సైతం ఘోషిస్తున్నాయి. అలాంటిది తమకు తాము శెహభాష్ అనుకోవడం మాని అందరూ మెచ్చుకొనేలా, పలువురికి ఆదర్శంగా నిలచేలా వ్యవహరిస్తే ఎవరూ ఆరోపించరు. విమర్శలు చేయరు.



*నెల్లూరులోని డిఇఓ కార్యాలయం. (ఫైల్‌ఫోటో).*

## ఆకట్టుకొన్న భజన బృందాలు

### టౌన్‌హాలులో దుమ్మురేగింది

తిరుమల తిరుపతి దేవస్థానం, ధర్మప్రచార పరిషత్, ధార్మిక మండలి సంయుక్త ఆధ్వర్యంలో జిల్లాస్థాయిలో భజన పోటీలు జరిగాయి. టౌన్‌హాలులో 22, 23 తేదీలలో రెండు రోజులపాటు జరిగిన ఈ పోటీలకు జిల్లావ్యాప్తంగా 120 సంఘాలు పాల్గొన్నాయి. తాళం భజన, కోలాటం, పండరి భజన, చెక్క భజన బృందాలు తమ కీర్తనలతో ఆకట్టుకొన్నాయి. కనుమరుగౌతున్న ఈ భజన కళాకారులను ఒక చోట చేర్చి వివిధ స్థాయిల్లో పోటీలు నిర్వహించడం నగర వాసులను అలరించింది. అయితే ఒక్కో భజన బృందం తమ ప్రావీణ్యాన్ని ప్రదర్శించేందుకు నిర్వాహకులు తమకు స్వల్ప సమయం కేటాయించడం పట్ల పలువురు కళాకారులు ఆవేదన వ్యక్తం చేశారు. ఈ పోటీల నిర్వహణలో సుధాకర్‌రాజు, వాకాటి విజయకుమార్‌రెడ్డి, అనంత్ తదితరులు పాల్గొన్నారు.


*ఆకట్టుకున్న తాళం భజన.*


*నెల్లూరు మినీ బైపాస్‌రోడ్డులో అన్నమయ్య విగ్రహాన్ని ఆవిష్కరించిన చినజియ్యర్ స్వామి. ప్రక్కన మంత్రి రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యేలు శ్రీధర్‌కృష్ణారెడ్డి, వివేకా తదితరులు.*



# ప్రసన్నకు పరాభవం!

ఏ గాలికా చాప ఎత్తే ఓడ సరంగు వంటివాడు కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి. పాత చరిత్ర వదిలేస్తే, మొన్నటి ఎన్నికలలో తెలుగుదేశం పక్షాన గెలిచాడు. ప్రచారంలో రాజశేఖర్‌రెడ్డిని నరరూప రాక్షసుడిగా వర్ణించి విమర్శించాడు. బ్యాలెట్ పత్రాల మీద ఓటు ముద్ర తడి ఆరకముందే తెలుగుదేశం పుట్టిని నట్టేట ముంచి అదే వైఎస్ పక్కన చేరిపోయాడు. నల్లపరెడ్డి ఇంట చెడబుట్టాడన్న చెడ్డ పేరును కూడా భరించి, తనను తాను 10కోట్ల రూపాయల బేరానికి అమ్ముకొన్నాడు. వైఎస్ మరణంతో, నేరుగా నేదురుమల్లి జనార్ధనరెడ్డి ఇంట ప్రత్యక్షమయ్యాడు. నీతోనే నా శేష జీవితమని బాస చేశాడు. అక్కడ పప్పులు వుడకడం లేదని అర్ధం కాగానే, ఆదాల ప్రభాకర్‌రెడ్డి ద్వారా ముఖ్యమంత్రి రోశయ్య చెంత చేరాడు. జగన్ అనే వాడి పేరు నా నోటితో పలకనని తల్లి తోడు ఒట్లు పెట్టాడు. సిఎం పేషీ నుంచి బయటకురాగానే ఆ ఒట్టు తీసి గట్టున పెట్టి జగన్ జిందాబాద్ అని ఇల్లెక్కి కూశాడు. తానెన్ని తిరుగుళ్లు తిరిగినా, ఎన్ని గడపలు తొక్కి వచ్చినా కోవూరు జనం వెర్రి వెంగళప్పల వలె తన తోక పట్టుకొని తిరుగుతారని ప్రసన్న నమ్మకం.

రామతీర్థం గ్రామ ప్రజలు ఆ నమ్మకాన్ని ఒమ్ము చేశారు. ఓదార్పు యాత్ర కోసం జగన్ వెంట తమ వూరికి వచ్చిన ప్రసన్న మీద తిరగబడడానికి సిద్ధమైపోయారు. సాహసించి వేదిక ఎక్కితే రాళ్లతో కొడతారని భయపడి, పోలీసు రక్షణతో, కారులో కూర్చుండి పోయాడు ప్రసన్న. మందిపాటి ప్రవీణ్ కుమార్‌రెడ్డి, చలపతి వంటి కాంగ్రెస్‌వాదులు ఎంత బ్రతిమలాడినా జనం విన్పించుకోలేదు. చివరకు జగనే మైక్ అందుకొని, ప్రసన్న నా కోసం వచ్చాడు, దయచేసి సర్దుకపోండి అని ప్రాధేయపడడంతో, పోనీలే పాపమని కారు దిగడానికి అనుమతించారు జనం.




## రోశయ్య శ్రమదానం

మొదటి పేజీ కొరవ

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హయాంలో ప్రారంభమైన అవినీతి యజ్ఞం రోశయ్య పాలనలో యధాతథంగా కొనసాగుతున్నది. అప్పటి కాంట్రాక్టర్లు, ఎస్ఇజడ్ నిర్వాహకులు, పారిశ్రామికవేత్తలు, భూఆక్రమణదారులు, పన్నుల ఎగవేతదారులు చాలా సుఖంగా వున్నారు. ఎమ్మెల్యేలు, కాంగ్రెస్ వాదులు మాత్రం ఏ పనీ జరగక లబోదిబోమంటున్నారు. మంత్రివర్గ విస్తరణలో రోశయ్య చూపుతున్న అలసత్వం ఆయన మీద నమ్మకం పెంచుకొన్న వారిని తీవ్ర ఆవేదనకు గురిచేస్తున్నది. ఇక ఆయన విస్తరణ జరపలేడన్న భావనకు వచ్చేశారు వారు. ఎమ్మార్ కంపెనీ గోల్మాల్ వంటి వ్యవహారాలలో రోశయ్య ప్రవర్తన సగటు కాంగ్రెస్‌వాదిని కూడా ఆశాభంగానికి గురి చేస్తున్నది. ఆయన అవినీతి పరుల కొమ్ము కాస్తున్నాడన్న భావన ఏర్పడి పోతున్నది. జగన్ వర్గీయులు మాత్రం ఈ పరిణామాల పట్ల చాలా సంతోషంతో వున్నారు. రోశయ్య ఇదే ప్రకారం మరొక ఆరేడు నెలలు పాలన చేస్తే కాంగ్రెస్ సమాధి ఖాయం అన్నది వారి ఆనందానికి కారణం. మంత్రివర్గ విస్తరణ జరగాలని జగన్ కోరుకొంటున్నాడు. రోశయ్య విస్తరణ జరిపితే, తొలగింపుకు గురైన మంత్రులందరూ తన దగ్గరకు వచ్చేస్తారని, తన బలం దానంతట అదిగా పెరిగిపోతుందని జగన్ ఆశ. ఎమ్మెల్యేలు కూడా మరొక ఏడాదికి మించి తనకు దూరంగా మెలగలేరని, 2014 ఎన్నికలు దగ్గర పడేకొద్దీ వారిలో భవిష్యత్తు మీద భయాలు పెరిగిపోతాయని, కాంగ్రెస్‌ను నమ్ముకొని ఎన్నికలకు వెళ్లలేరు కాబట్టి, చచ్చినట్లు తన దగ్గరకు వచ్చేస్తారని జగన్ నమ్ముతున్నాడు. అందువల్లనే మరొక ఏడాది పాటు ఓదార్పు యాత్రను సాగదీసి, ఎదురు చూడాలన్న నిర్ణయానికి వచ్చాడు. అధిష్టానం కూడా జగన్ ఆలోచనలకు అనుకూలంగా నడుచుకొంటున్నది. జగన్ విషయంలో ఏ నిర్ణయం తీసుకోకుండా కాలయాపన చేయడం ఏ కారణం వల్లనో తెలియదు కానీ, దాని వల్ల జగన్‌కు మంచి ఉపయోగమే జరుగుతున్నది. ఆయన వైపు వెళ్లిన ఎమ్మెల్యేలు, ఎమ్పీలు హాయిగా వున్నారు. వారికి అటు రోశయ్యతో పనులు జరుగుతున్నాయి. ఇటు జగన్‌తో మమేకం పెరుగుతున్నది.

## జనవాణి

2వ పేజీ కొరవ

### దళిత క్రైస్తవులు ఎస్.సిలా?

దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి రాష్ట్ర అసెంబ్లీలో దళిత క్రైస్తవులకు ఎస్‌సి రిజర్వేషన్ వర్తింప జేస్తూ తీర్మానం చేయించాడని దాన్ని కేంద్రప్రభుత్వం అనుమతి కొరకు పంపి వున్నందున ఈ వ్యవహారమై చట్టం చేయాలని దళిత క్రైస్తవ సంఘాలు కోరుతున్నాయి. కాని వాస్తవంగా మన రాష్ట్రంలో దాదాపుగా 90 శాతం దళిత క్రైస్తవులు ఇదివరకే ప్రభుత్వ రికార్డులలో ఎస్‌సిలుగా (దళిత హిందువులు)గా నమోదై వున్నారు. ఎస్‌సి రిజర్వేషన్లు పొంది వున్నారు. ఇంకా పొందుతున్నారు. కనుక వీరిని ఎస్‌సిలుగా పరిగణించమని కోరడంలో ఔచిత్యం లేదు. కానీ కొంతమంది దళితులు క్రైస్తవ మతాన్ని మనసాక్షిగా ఆచరిస్తూ బిసి–సిలుగా వున్నారు. ప్రభుత్వం అక్రమంగా ఎస్‌సి రిజర్వేషన్లు పొందిన వారి రికార్డులు పరిశీలించి వారి రిజర్వేషన్లు రద్దు చేసి బిసి–సిలకు న్యాయం చేసేలా చట్టం తేస్తే మంచిది.

కె.రాబర్డ్‌సన్ గూడూరు

### తెల్లకార్డులు – ఆరోగ్యశ్రీ కార్డులు!

ఆదాయపు పన్ను చెల్లించేవాళ్లు సొంతకార్లు కలిగియున్న వాళ్లు, వ్యాపారం చేస్తూ వాణిజ్య పన్నులశాఖకు వ్యాట్ చెల్లించేవాళ్లు తెల్లరేషన్ కార్డులు పొంది వున్నారు. ఇటువంటి వారు ఆరోగ్యశ్రీ కార్డుల ద్వారా ఆపరేషన్లు సైతం చేయించుకొన్నారు. తప్పుడు సమాచారంతో ఈ పథకాలతో లబ్దిపొందిన వారిపై ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలి. మంచి వార్షిక ఆదాయం వుండి ఉపకార వేతనాలు, బోధనాఫీజులు పొందుతున్న వారిపై కూడా ప్రభుత్వం చర్యలకు వుపక్రమిస్తే దారిద్ర రేఖకు దిగువనున్న వారికి న్యాయం జరుగుతుంది. ఈ పథకాలు పదికాలాలపాటు సాగుతాయి.

ఆలూరు ఆత్మానందం నెల్లూరు

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### జైన్‌గోల్డ్‌లో అస్మి వజ్రాల నగలు

నెల్లూరు ఆచారివీధిలోని ప్రముఖ నగల షోరూం జైన్‌గోల్డ్‌లో దీపావళి పండుగను పురస్కరించుకొని ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన అస్మి బ్రాండెడ్ వజ్రాల ఆభరణాలను అందుబాటులో వుంచుతామన్నారు. 15వేల నుంచి 35వేల రూపాయల వరకు అస్మి వజ్రాల నగలు కొనుగోలు చేసిన వారికి ఐదువేల రూపాయల డైమండ్ పెండెంట్‌ను, 35వేల నుంచి 55వేల రూపాయల డైమండ్ నగలు కొనుగోలు చేసినవారికి 7500 రూపాయల డైమండ్ పెండెంట్, ఇంకా ఎక్కువ కొనుగోలు చేసిన వారికి అదే స్థాయిలో డైమండ్ వస్తువులు కానుకగా ఇస్తారట. వజ్రాల నగల కొనుగోళ్లపై సందేహాలు ఇతర సమాచారాన్ని 2319131, 2319132 నెంబర్లకు ఫోన్‌చేసి తెలుసుకోవచ్చంటున్నారు జైన్ గోల్డ్ అధినేతలు మణిలాల్ జైన్, నరేంద్ర జైన్.

### దైవసేవలో ఆల్తూరి కుటుంబం!

నెల్లూరీయుడు ఆల్తూరి ఆదినారాయణరెడ్డి ఎఎంఆర్ గ్రూప్ అధినేతగా దేశవ్యాప్తంగా గుర్తింపు పొందిన పారిశ్రామికవేత్త. వీరి కుటుంబానికి దైవ భక్తి మెండు. ఆదినారాయణరెడ్డి కుమారులు మహేష్ కుమార్‌రెడ్డి, గిరీష్‌కుమార్‌రెడ్డిలు షిర్డిలోని సాయిబాబా మందిరం అభివృద్ధికి ఇతోధికంగా సాయపడ్డారు. అదేవిధంగా నెల్లూరులోని రాజరాజేశ్వరమ్మ దేవస్థానం, మూలస్థానేశ్వరస్వామి దేవస్థానం, రామతీర్థంలోని రామలింగేశ్వరస్వామి దేవస్థానాల అభివృద్ధికి ఎంతగానో కృషి చేస్తున్నారు. ఇంతటి దైవ సేవచేస్తున్న ఆల్తూరి కుటుంబీకుడు గిరీష్‌కుమార్ రెడ్డి నెల్లూరు రాజరాజేశ్వరమ్మ దేవస్థానం పాలక మండలి సభ్యునిగా ఇటీవల నియమితులై ప్రమాణ స్వీకారం చేశారు. దైవసేవ చేసే వారికి దైవం అండ మెండని ఆల్తూరి కుటుంబాన్ని చూసి చెప్పొచ్చు.

## జగన్ యాత్ర

16వ పేజీ కొరవ

నెలాఖరు వరకో జీడిపాకం వలె సాగాలి. కానీ కావలిలో ఎదురైన చేదు అనుభవాలకు కలత చెందిన జగన్, పార్లమెంట్ సమావేశాల సాకుతో యాత్రను కుదిస్తున్నట్లు ప్రకటించాడు. అందువల్ల దీనికొక ముగింపు లభించింది. లేకుంటే టీవీ ఛానళ్ల డైలీ సీరియల్ వలె ఎన్నాళ్లు సాగేదో చెప్పలేము. 7తేది ఉదయం 10 గంటలకు గాంధీబొమ్మ వద్ద పెట్టిన వైఎస్ విగ్రహాన్ని ఆవిష్కరించి, అక్కడే ముగింపు సభ జరిపి, మద్రాసు మీదుగా ఢిల్లీకి ఎగురుతూ వెళ్లి పోతాడట. జనం ఎంత ఉత్సాహంగా వస్తున్నా యాత్రలో ఆసక్తి, ఆకర్షణ కల్గించే అంశం ఒక్కటీ లేదు. ఎగురుతూ వచ్చి, నీరసంగా తిరుగుముఖం పట్టవలసి వస్తున్నది. చెప్పిందే చెప్పడం, అరిగిపోయిన రికార్డును మళ్లీ మళ్లీ ప్లే చేయడం తప్ప జగన్ ప్రసంగంలో చిన్నపాటి కొత్తదనం కూడా లేదు. అదే భాష, అదే యాస, అదే మాట సాగతీత, అదే చెయ్యి తిప్పుడు, అదే తలనిమురుడు. చచ్చే విసుగు పుడుతున్నది.

## మంతనాల మర్మమేమిటి?

16వ పేజీ కొరవ

టర్‌కు రావాలన్నా ముందు పైలట్, వెనుక ఎస్కార్ట్ కార్లతో కుయ్యి కుయ్యి మనే సైరన్ మోతతో రాజు వెడలె అన్నట్లు బయలుదేరుతాడు. కానీ ఈ అతిథి గృహ సమావేశానికి మాత్రం ఏ ఆడంబరమూ లేదు. ఎంత నిశ్శబ్దంగా వెళ్లాడో, అంతే నిశ్శబ్దంగా వచ్చేశాడు. జగన్ పొడంటేనే గిట్టనివాడికి, జగన్ కోసం తమ సర్వస్వం ధారపోయడానికి సిద్ధపడిన అనుచర ముఖ్యులతో ఏమి పని? చుట్టపు చూపు పలకరింపు అనుకొందామా అంటే, దొంగలాగా దాగుకొని వెళ్లవలసిన అగత్యం ఏమిటి?

ఈ మంతనాలలో ఏ రాజకీయ మర్మం ఇమిడి వుందో మనకైతే తెలియదు. తమ మనసంతా జగన్ మీదే లగ్నమై వుందని, కానీ మంత్రిపదవి అడ్డంతో ఓదార్పు యాత్రకు రాలేకపోతున్నామని, రేపు రోశయ్య దిగిపోగానే జగన్ పక్కనే నిలబడతామని బాస చేయడానికి వెళ్లాడని ఒక కథనం. అది నిజం కూడా కావచ్చు. అటువంటి లాలూచీ కుస్తీలు వారికి వెన్నతో పెట్టిన విద్య. అయితే తానిట్లా జగన్‌తో మంతనాలాడానన్న నిజం బయటకొస్తే రోశయ్యకు ఎక్కడ అనుమానం కల్గుతుందో అన్న భీతితో, రహస్య సమావేశం నడిపాడట. అయితే ఆనోటా ఈనోటా పడి ఈ రహస్యం కాస్తా బట్టబయలు కావడంతో, ఇటు కాంగ్రెస్‌వాదులు, అటు జగన్ వాదులు కూడా ఉలిక్కిపడుతున్నారు.

● ఇఫ్కో కిసాన్‌సెజ్‌పై

# తూతూమంత్రంగా ప్రజాభిప్రాయ సేకరణ!



ప్రజాభిప్రాయ సేకరణలో కలెక్టర్‌ను ప్రశ్నిస్తున్న రైతులు.

**● కొడవలూరు మండలం రాచర్లపాడు దగ్గర ఇఫ్కో సంస్థ ఏర్పాటు చేయ తలపెట్టిన కిసాన్ సెజ్ కోసం 2,800 ఎకరాల భూమి సేకరించారు. కిసాన్‌సెజ్ ఏర్పాటుకు నిర్వహించిన జనాభిప్రాయ సేకరణకు కేవలం 50 మంది రైతులే వచ్చారంటే ఇది ఏ తరహా అభిప్రాయ సేకరణో అర్థం చేసుకోవచ్చు.**

జిల్లాలోని కొడవలూరు మండలం రాచర్లపాడు గ్రామ సమీపంలో ఇఫ్కో సంస్థ నిర్మించ తలపెట్టిన కిసాన్‌సెజ్‌పై ఈ నెల 26వ తేదీన పర్యావరణ విషయమై ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమానికి కేవలం 50 మంది రైతులు మాత్రమే హాజరయ్యారు. ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమంలో రైతులు అనేక సందేహాలను వ్యక్తం చేయడంతోపాటు ఆర్థిక మండలి ఏర్పాటుకు భూములు అందజేసిన రైతులు అధికారుల తీరుపై ఆగ్రహం వ్యక్తం చేశారు.

1992వ సంవత్సరంలో అప్పటి ఇఫ్కో ఛైర్మన్ పెళ్లకూరు రామచంద్రారెడ్డి రాచర్లపాడు సమీపంలో ఎరువుల కర్మాగారాన్ని ఏర్పాటు చేసేందుకు కృషి చేశారు. ఇందుకు అవసరమైన 2,800 ఎకరాలను రైతుల నుంచి సేకరించారు. వీటిలో ప్రభుత్వ భూములు, పట్టాభూములు, సిజెఎఫ్ఎస్ తదితర భూములున్నాయి. అప్పట్లో రైతుల నుంచి సేకరించిన భూములకు ఎకరాకు 40వేల రూపాయల వంతున పరిహారంగా అందజేయడం జరిగింది. 2008వ సంత్సరంలో దివంగత ముఖ్యమంత్రి వై.ఎస్ రాజశేఖర్‌రెడ్డి ఆగ్రోపార్క్, ఇఫ్కో కిసాన్‌సెజ్‌కు శంకుస్థాపన చేశారు.

దాదాపు 18 సంవత్సరాల క్రితం భూములు కోల్పోయిన రైతులకు ప్రతి కుటుంబంలో ఒక వ్యక్తికి సెజ్‌లో ఉపాధి అవకాశం కల్పిస్తామని అధికారులు హామీ ఇచ్చారు. భూములు అందజేసిన రైతులలో కొంత మంది మరణించడం కూడా జరిగింది. మరి కొందరు గ్రామాన్ని వదలి వెళ్లిపోయారు. ప్రస్తుతం ఈ భూములు ఎకరా 2లక్షల నుంచి 4లక్షల వరకు ధర పలుకుతుంది. దాదాపు 560 కోట్ల రూపాయల పెట్టుబడితో కిసాన్‌సెజ్ ఏర్పాటు కానుంది. భూమి యాజమానులు నిర్వాసితులు కాకుండా అన్ని సదుపాయాలు కల్పిస్తామని అధికార్లు ప్రకటిస్తున్నా రైతులు మాత్రం నమ్మడం లేదు.

పర్యావరణానికి సంబంధించి కూడా ఎటువంటి అపోహలకు తావులేదని అధికార్లు భరోసా ఇస్తున్నారు. యూరోపియన్ సాంకేతిక పరిజ్ఞానంతో కాలుష్య నియంత్రణ చేయడం జరుగుతుందని చెబుతున్నారు. దీని నుంచి వెలువడే దుమ్ము, ధూళిని క్రమం తప్పకుండా నీటిని చల్లడం ద్వారా, మొక్కలను పెంచడం ద్వారా గ్రీన్‌బెల్ట్‌ల అభివృద్ధి ద్వారా నియంత్రించడం జరుగుతుందని వివరిస్తున్నారు. ఇప్పటికే భూములు సేకరించి దాదాపు 18 సంవత్సరాలు పూర్తి కావస్తున్నా ఇంకెప్పటికి సెజ్ ఏర్పాటు జరుగుతుందని సమీప గ్రామాల రైతులు ప్రశ్నిస్తున్నారు.

ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమం గురించి ముందస్తు సమాచారం లేకపోవడంతో రైతులు చాలా తక్కువ సంఖ్యలో హాజరయ్యారు. ఉదయం 11 గంటలకు ప్రారంభమైన ఈ కార్యక్రమం కేవలం గంట వ్యవధిలో ముగిసింది. జిల్లా కలెక్టర్ కె.రాంగోపాల్, కావలి ఆర్డీఓ ఎం.వెంకటేశ్వర్లు, కిసాన్‌సెజ్ సిఇఓ రాజశేఖరయ్య, కొడవలూరు తహశీల్దార్, ఎంపిడిఓలతోపాటు వివిధ శాఖలకు చెందిన అధికార్లు పాల్గొన్నారు. పర్యావరణంపై జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో వివిధ రాజకీయ, ప్రజా సంఘాల నేతలు ఎవరు హాజరు కాలేదు.

పర్యావరణంపై రైతులకు అవగాహన లేకపోవడంతో దీనిపై ఎవరు మాట్లాడలేకపోయారు. ఉపాధి అవకాశాల గురించి మాత్రమే అధికారులను ప్రశ్నించారు. ఎటువంటి ఇబ్బంది లేకుండా అధికార్లు రైతులకు అన్ని హామీలు ఇచ్చి ముగించడం విశేషం.

---

# నెల్లూరీయుల ప్రాణాలు తీస్తున్న డెంగ్యూ జ్వరం!

**జిల్లాలో డెంగ్యూ జ్వర పీడితుల సంఖ్య రోజురోజుకు పెరిగిపోతున్నది. ఇంతవరకు గ్రామీణ ప్రాంతాల్లోనే కనిపించిన ఈ జ్వరం నెల్లూరు నగరాన్నీ వణికిస్తున్నది. ఇప్పటివరకు 120 మందికి పైగా ఈ జ్వరం సోకి చనిపోయినా ప్రజాప్రతినిధులు, అధికార యంత్రాంగంలో చలనం లేదు.**

జిల్లాను డెంగ్యూ జ్వరం వణికిస్తోంది. పట్టణం, గ్రామం, గల్లీ అనే తేడా లేకుండా అన్ని ప్రాంతాలలోని ప్రజలు ఈ జ్వరానికి గురై ఆస్పత్రుల పాలవుతున్నారు. పలువురు ప్రాణాలు పోగొట్టుకొన్నారు. పారిశుద్ధ్యం లోపించడం, దోమలు విజృంభిస్తుండడంతో డెంగ్యూ జ్వరం రోజురోజుకు విస్తరిస్తుంది. గూడూరు డివిజన్‌లోని గ్రిద్దలూరు గ్రామస్తులు అధిక సంఖ్యలో విషజ్వరాల బారిన పడ్డారు. ఉదయగిరి, ఆత్మకూరు, బుచ్చి, కావలి, బోగోలు మండలాల్లో ఈ జ్వర తీవ్రత ఎక్కువగా వుంది. జిల్లాలోని ప్రభుత్వ ఆస్పత్రులు, ప్రైవేట్ ఆస్పత్రులన్నీ జ్వరపీడితులతో కిటకిటలాడుతున్నాయి. అనధికార లెక్కల ప్రకారం ఇప్పటివరకు జిల్లాలో 120 మందికిపైగా డెంగ్యూ జ్వరం కారణంగా ముత్యువాత పడినట్లు సమాచారం. వైద్య ఆరోగ్యశాఖ అధికారులు మాత్రం డెంగ్యూ మరణాలేవీ లేవని ప్రకటించడం విశేషం.

డెంగ్యూ జ్వరం సోకిన వారికి సత్వర వైద్యం అందించాల్సి వుంటుంది. వీరిలో రక్త కణాల సంఖ్య (ప్లేట్‌లెట్స్) పడిపోతుంది. సరైన సమయంలో ప్లేట్‌లెట్స్‌ను ఎక్కించినట్లయితే రోగి ప్రాణాపాయం నుంచి బయటపడతాడు. కానీ ప్లేట్‌లెట్ల కొరత పట్టి పీడిస్తోంది. డెంగ్యూ జ్వర బాధితుల సంఖ్య అధికమవుతుండడంతో రెడ్ క్రాస్ అందిస్తున్న ప్లేట్‌లెట్ల సంఖ్య సరిపోవడం లేదు. వ్యాధిబారిన పడిన పలువురు నెల్లూరు, మద్రాసు ఆసుపత్రులలో చికిత్స పొందుతున్నారు. ఇంతగా జిల్లాను డెంగ్యూ చుట్టుముట్టినా అధికారులకు చీమకుట్టినట్ల యినా లేకపోవడం విమర్శలకు తావిస్తోంది. వ్యాధులు ప్రబలకుండా చర్యలు తీసుకొంటున్నామని ప్రకటించి చేతులు దులుపుకోవడం మినహా అధికార యంత్రాంగంలో ఎలాంటి స్పందన ఉండడం లేదు. డెంగ్యూ జ్వర వ్యాప్తికి పారిశుద్ధ్యం క్షీణించడమేనని తెలిసినా పారిశుద్ధ్యం మెరుగుదలకు ఎలాంటి ప్రయత్నాలు లేవు. ప్రభుత్వం పారిశుద్ధ్యాన్ని మెరుగుపరచేందుకు నిధులు విడుదల చేసి వారోత్సవాలు నిర్వహించాలని ఆదేశించినా తూతూ మంత్రంగా కార్యక్రమాలు అయిందనిపించారు తప్ప ఎక్కడా పారిశుద్ధ్యం మెరుగైన దాఖలాలు లేవు. మరోవైపు గ్రామీణ ప్రాంతాలు, ప్రధాన సెంటర్లలో చెత్తకుప్పలు, మురికినీరు నిల్వ వుండి దోమల కేంద్రాలుగా మారుతుండడంతో విషజ్వరాలు సోకి ప్రజలు అల్లాడిపోతున్నారు. జిల్లాలో ప్రతి మండలంలో డెంగ్యూవ్యాధి, ఇతర విషజ్వరాల బారినపడిన కుటుంబాలు కన్పిస్తున్నాయి. కుటుంబ భారాన్ని మోసేవారు, చిన్నారులు ప్రాణాలు కోల్పోవడంతో ఆ కుటుంబాల పరిస్థితి దయనీయంగా వుంది. ఇప్పటికైనా వైద్యఆరోగ్యశాఖ అధికారులు కుంభకర్ణ నిద్ర వదిలించుకొని డెంగ్యూ జ్వరం ప్రబలకుండా వుండేందుకు అవసరమైన చర్యలు చేపట్టి ప్రజల ప్రాణాలకు భద్రత కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది.



నెల్లూరు రామచంద్రారెడ్డి ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న జ్వరపీడితులు.



# జగన్ యాత్రలో జనసముద్రాలు!

## కావలి నియోజకవర్గలో జనం లేక వెలవెల బోయిన జగన్ ఓదార్పు యాత్ర జిల్లాలో ప్రస్తుతం అద్భుతంగా సాగుతోంది.

మొదట మొదట అబ్బే... అని పెదవి విరిచేట్లు జరిగిన వైఎస్ జగన్ ఓదార్పు యాత్ర, రాను రాను అబ్బా... అని నోరు తెరిచే రీతిలో నడుస్తున్నది. కావలి నియోజకవర్గంలో జనం లేక వెలవెల పోయిన సభలను చూసి జగన్ యాత్రకు పురిటిలోనే సంధి తగిలిందని తేలబలికారు. ఉదయగిరి ఆ కొరతను కొంతవరకు తీర్చింది. కానీ ఆత్మకూరు నియోజకవర్గంలోకి అడుగు పెట్టేసరికి అంతా తారు మారు. ఆత్మకూరు, సోమశిల వంటి చోట్ల జనసముద్రాలు దర్శనమిచ్చాయి. ఇక్కడొక చలోక్తి కూడా విన్పడుతున్నది. ఉదయగిరిలో మేకపాటి సోదరులు ఓదార్పు యాత్రకు పిలిచారు కాబట్టి జనం ముఖం చాటేశారని; ఆత్మకూరులో ఆనం సోదరులు యాత్రకు వెళ్తే బడితె పూజ చేస్తామని బెదరించారు కాబట్టి అదేమిటో చూద్దామని జనం విరగబడి వచ్చారని సరదాగా చెప్పుకొంటున్నారు. కొంతవరకు అది నిజం కూడా కావచ్చు.

నెల్లూరు రూరల్ నియోజకవర్గ గ్రామాలలో అయితే జనం పోటెత్తారు. యాత్ర ఈ ప్రాంతానికి వచ్చేసరికి ఒక వేళా పాళా లేకుండా పోయింది. చెయ్యి నొప్పితో రెండు రోజులు వాయిదా వేశారు. మళ్లీ మొదలు పెట్టినా, రైళ్ల మాదిరి చెప్పిన సమయానికి సరిగా 24 గంటలు ఆలస్యంగా వచ్చాడు. అయినాసరే జనంలో అంత ఓపిక ఎక్కడ నుంచి వచ్చిందో తెలియదు. అర్ధరాత్రి అయినా, అపరాత్రి అయినా లెక్క చేయలేదు. బుచ్చి, కోవూరు, ములుమూడి వంటి గ్రామాలలో మహిళలు కూడా ఇల్లు వదలి రోడ్ల మీదకు వచ్చేశారు. ఆ దృశ్యాలను చూస్తే, ఏదో తిరునాళ్లకు వెళ్లినట్లు వుండింది తప్ప, రాజకీయ సభకు హాజరుగా కన్పించలేదు.

కోవూరు నియోజకవర్గంలో ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి బహిరంగంగానే వేదిక ఎక్కాడు. తెలుగుదేశం పార్టీ వ్యతిరేక కార్యక్రమం కాబట్టి, అందులో పాల్గొంటే ఎమ్మెల్యే పదవికి అనర్హుడిగా ప్రకటించవలసి వస్తుందని ఆయన్ను స్పీకర్ కిరణ్‌కుమార్‌రెడ్డి హెచ్చరించినట్లు ఒక వార్త వచ్చింది. దానికి భయపడే, జగన్ స్వాగత ప్రకటనలలో తన ఫోటో, పేరు లేకుండా తన కుమారుడి బొమ్మలు అచ్చేశాడు ప్రసన్న. అయితే జగన్ చేస్తున్నది కేవలం వ్యక్తిగత యాత్ర కాబట్టి, దీనికి పార్టీ వ్యవహారాలకు ఏమీ సంబంధం లేదని న్యాయ నిపుణులు ఆయనకు సలహా ఇచ్చారట. దానితో చలి దీరిపోయిన వాడి వలె బహిరంగంగానే వేదిక ఎక్కేశాడు.


సాల్మాన్‌పురం గ్రామంలో మాట్లాడుతున్న జగన్.

నెల్లూరు రూరల్ నియోజక వర్గంలో యాత్ర బరువు మొత్తం తమ భుజాల మీద నడిపించారు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్, రూప్‌కుమార్ యాదవ్ త్రయం. ఆనం వారంటే వీరులు శూరులు కాబట్టి, వారి ప్రాంతాలలో వారిని ఎదిరించి ఎవరూ నిలువ లేరన్న దుష్ప్రచారం ఒకటి వుంది కాబట్టి, కొంచెం అధిక జాగ్రత్తలు తీసుకొన్నారు. దానితో మామూలు కంటే బాగా జరిగాయి సభలు. యాత్రకు వెళ్లవద్దని ఎమ్మెల్యే వివేకానందరెడ్డి చేసిన హుకుం ఎవరినీ భయపెట్టలేకపోయింది. వారు వద్దని ఒత్తిడి చేసేకొద్దీ మరింత ఉత్సాహంగా వూళ్లనుంచి కదిలారు జనం.

జగన్ యాత్ర నవంబర్ 7తేది వరకు జరుగుతుంది. మొదట అనుకొన్న ప్రకారమైతే ఏ డిసెంబర్

కొరవ 14వ పేజీలో

### ● మంత్రిగారి

## మంతనాల మర్మమేమిటి?

రాజకీయవాదులు ఎప్పుడేమి చేస్తారో వూహించడం వారిని పుట్టించిన బ్రహ్మకు కూడా తరం కాదు. అందులోను అవకాశవాద రాజకీయాలను తమ జీవనశైలిగా మలచుకొన్న ఆనం సోదరుల వంటి వారి విషయంలో ఇది మరింత కష్టం.

జిల్లా రాజకీయాలలో వైఎస్ జగన్‌కు, ఆనం వారికి ఆమడ దూరం అన్న సంగతి అందరికీ తెలుసు. జగన్ పొడగిట్టనట్లు వ్యవహరిస్తున్నారు వారు. జగన్ చేత ప్రారంభించడానికి నెల్లూరు నగరంలో ఎవరు ఏ చిన్న విగ్రహం పెట్టబోయినా తమ అధికార బలాన్నంతా ప్రయోగించి అడ్డుకొంటున్నారు. పోలీసును పంపి జగన్ అనుచరులను చావ బాధిస్తున్నారు. ఈ నేపథ్యంలో మంత్రి ఆనం రామనారాయణరెడ్డి జగన్ వర్గం నేతలతో రహస్య సమావేశం జరిపాడంటే నమ్మగలమా? కానీ నమ్మక తప్పదు. ఎందుకంటే, అది నూటికి పద హారణాల నిజం.

26తేది, మంగళవారం రాత్రి నెల్లూరు చెరువు కట్ట మీదున్న పినాకిని అతిథి గృహంలో జరిగిందీ రహస్య సమావేశం. జిల్లాలో జగన్ ఓదార్పు యాత్రలో పాల్గొనడానికి వచ్చిన కడప జిల్లా ఎమ్మెల్యేలు శ్రీనివాసులు (రైల్వేకోడూరు), ఆదినారాయణ రెడ్డి (జమ్మలమడుగు), మాజీ ఎమ్మెల్యే వరదరాజులరెడ్డి తదితరులు ఆ గెస్ట్‌హౌస్‌లో మకాం చేశారు. రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత, నెత్తిన లైట్‌లేని కారులో దొంగ వలె వెళ్లాడక్కడకు రామనారాయణరెడ్డి. సాధారణంగా రామనారాయణ రెడ్డి నెల్లూరులో తమ ఇంటి నుంచి కాపువీధి సెం

కొరవ 14వ పేజీలో

### కార్టూన్ స్కేప్



'అబ్బే'.. భూకంపం కాదు సార్...
రాజీవ్‌గాంధీ పేరు తీసేయమని... విపక్షాల
విమర్శలతో ఏపి దద్దరిల్లుతోంది... అంతే!



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.